# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక"— ఫెవీ ఫెయిరీ





గాజుల స్టాండు ఎలా తయారు చెయ్యడం అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.

"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
దబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపోండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా చేసెయ్యింక"

ఫెవికాల్ ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**



# చందమామ

ఫిబ్రవరి 1988



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

No share prices,
no political fortunes, yet...

# Over 40% of Heritage readers are professionals or executives, 61% from households with a professional / executive as the chief wage earner. Half hold a postgraduate degree or a professional diploma.

– from an IMRB survey conducted in Oct. 1986




It's an unusual magazine. It has a vision for today and tomorrow.

It features ancient cities and contemporary fiction, culture and scientific developments, instead of filmstar interviews and political gossip. And it has found a growing readership, an IMRB survey reveals. Professionals, executives and their families are reading The Heritage in depth – 40% from cover to cover, 42% more than half the magazine.

More than 80% of The Heritage readers are reading an issue more than once.

And over 90% are slowly building their own Heritage collection.

Isn't it time you discovered why?



## THE HERITAGE



CMP-2155

**So much in store, month after month.**




# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ [''రాక్షసరాజు పరిహాసం'']కు ఆధారం, ''వసుంధర'' రచన. సమాజంలో వ్యక్తి స్వశక్తిపైనా, మిత్రుల సహాయ సహకారాల మీదా ఆధారపడి జీవనం సాగించవచ్చు. అలా కాక, అలౌకిక శక్తులను నమ్ముకుంటే, ఫలితం ఎలా వుంటుందో ''కలలమనిషి'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

మృద్ఘట ఇవ సుఖభేద్యో, దుఃసంధానశ్చ దుర్జనో భవతి,
సుజనస్తు కనకఘటవద్, దుర్భేద్యశ్చాశుసంధేయః.

[మట్టికుండ సులభంగా పగిలిపోతుంది; ఆ తరవాత అతకడం అసాధ్యం. కాని బంగారుపాత్ర అంత సులభంగా పగలదు. ఒక వేళ పగిలినా, తేలిగ్గా అతికించవచ్చు. అదేవిధంగా దుర్జనుల మధ్య అల్పవిషయాలకే స్పర్థలు వస్తాయి; అపైనపోవు. కాని, సజ్జనులమధ్య స్పర్థలురావు; వచ్చినా వెంటనే సమసిపోతాయి.].


సంపుటి 82 ఫిబ్రవరి '88 సంచిక 2

విడి ప్రతి : 2–50 :: సంవత్సర చందా : 30–00

# చందమామ కబుర్లు





## అంతరిక్షంలో సరికొత్త రికార్డు

సోవియట్ వ్యోమగామి 42 ఏళ్ళ రొమానెన్కో, దాదాపు 237 రోజులు అంతరిక్షంలో వుండి సరికొత్త రికార్డు సృష్టించాడు. ఆయన అన్ని రోజులూ అంతరిక్షంలో ఎన్నో పరిశోధనలు జరిపివచ్చాడు।

## మునిగిపోయిన ద్వారక!

కృష్ణుడు అవతారం చాలించాక, ఆయన నిర్మించిన ద్వారకా నగరం సముద్రగర్భంలో కలిసిపోయిందని పురాణాలు చెబుతాయి. నిజంగానే సౌరాష్ట్ర సముద్ర తీరనగరం ఒకటి దాదాపు 4000 ఏళ్ళ క్రితం సముద్రంలో మునిగిపోయిందనడానికి ఆధారాలు బయటపడుతున్నవి.





## ఆర్యుల దాడి లేదు!

ఆర్యుల దాడి కారణంగా అంతకు పూర్వం భారతదేశంలో వున్న హరప్పా నాగరికత అంతమైపోయిందన్న విషయం అందరికీ తెలుసు. ఈ సిద్ధాంతం సరికాదంటున్నారు ప్రముఖ చరిత్రకారుడు డా॥ భగవాన్‌సింగ్. ఎందుకంటే—ఆర్యుల నాగరికతా, హరప్పా నాగరికతా రెండూ ఒకే విధంగా వుండేవని ఆయన ఎన్నో ఆధారాలతో బల్లగుద్ది చెబుతున్నాడు।

## అతిచిన్నదైన ఖురాను

ఇటీవలవరకు మహమ్మద్ కమాల్ హుస్సేన్ కుటుంబంలో, 2.0—2.7 సెం॥ మీ॥ పరిమాణం గల చేతితో రాయబడిన ఖురాన్ను తాయెత్తుగా ధరించేవారు. దీనినే ప్రపంచంలోకెల్లా చాలా చిన్నసైజు ఖురానుగా భావిస్తున్నారు. రెండు మిలియన్ డాలర్ల విలువచేసే ఈ చిన్న ఖురాన్ ప్రస్తుతం దుబాయ్‌లో భద్రపరచబడి ఉన్నది।



పురాణగాథలు :

# హంసడింభకులు

సాల్వరాజైన బ్రహ్మదత్తుడికి చాలా కాలంవరకు సంతానం కలగలేదు. అందువల్ల కులగురువు ఒకనాడు, "మన రాజ్యంలోని ప్రజలందరూ మీ సంతానంవంటివారే. వారిలో ఉత్తముడూ, యోగ్యుడూ అయిన ఒకరిని స్వీకరించి, మీ తరవాత సింహాసనాన్ని అప్పగించడం మంచిది," అని రాజుకు సలహా ఇచ్చాడు.

కాని, ఇది బ్రహ్మదత్తుడికి నచ్చలేదు. ఆయన తపస్సు ఆచరించి శివుణ్ణి మెప్పించి, సంతానం కలిగే విధంగా వరాలు పొందాడు. అచిరకాలంలోనే రాజుకు హంసుడు, డింభకుడు అనే ఇరువురు కుమారులు కలిగారు. శ్రద్ధగా విద్యాబుద్ధులు నేర్పి, వారిని ధర్మమార్గంలో పెంచమని, గురువు రాజుకు చెప్పాడు. అయితే, లేకలేక కలిగిన సంతానం కావడంవల్ల, రాజు పిల్లలపట్ల అమితమైన గారాబం చూపసాగాడు. ఆ కారణంవల్ల హంసడింభకులు అల్లరిచిల్లరగా పెరిగి, జరాసంధుడితో స్నేహం సంపాయించారు. తపస్సుచేసి, తమను ఎవరూ జయించకుండా ఉండాలని బ్రహ్మ నుంచి వరాలు పొందారు. ఆ వరగర్వంతో సాధువులందరినీ వేధించసాగారు. తమను మించినవారు భూలోకంలో ఉండకూడదన్న అహంభావం వాళ్ళకు కలిగింది. తండ్రిచేత రాజసూయం చేయించి, రాజులందరితోపాటు ద్వారకను పాలించే కృష్ణుడికి కూడా, కప్పం తీసుకురమ్మని కబురు పంపారు।

వాళ్ళ దుర్మార్గాన్ని సహించలేక, కృష్ణుడు, వాళ్ళ అంతం చూడడానికి ఒక ఉపాయం ఆలోచించాడు. హంసకుణ్ణి రహస్యంగా బంధించి, వాడు మరణించాడన్న పుకారు పుట్టించాడు. ఆ పుకారు డింభకుడి చెవిని పడింది. హంసుడి ఎడబాటును సహించలేక వాడు, యమునానదిలో దూకి ప్రాణాలు వదిలాడు. డింభకుడి మరణవార్త విన్న హంసుడు సైతం, సోదరుడు లేని జీవితం మీద విరక్తిపుట్టి బలవన్మరణం పాలయ్యాడు।

కొన్నాళ్ళకు కులగురువు రాజును దర్శించి, "సంతానం కలిగినంత మాత్రాన సంబరపడి పోకూడదు. వారికి మంచిచెడ్డలు తెలియచెప్పి, ధర్మమార్గంలో పెంచవలసిన గురుతర బాధ్యతను తల్లిదండ్రులు మరిచిపోకూడదు. బాధ్యతను ఉదాసీనం చేస్తే పర్యవసానం ఇలాగే ఉంటుంది," అన్నాడు.

బ్రహ్మదత్తుడు తన అశ్రద్ధకు ఎంతగానో పశ్చాత్తాపపడ్డాడు.





# కలలమనిషి

అనంతపురి రాజ్యంలోని, ఒక గ్రామంలో, యువకుడొకడుండేవాడు. వాడికి చదువు సంధ్యలూ, పనిపాటులూ ఏమాత్రం అబ్బ లేదు. వాడికి నా అన్నవాళ్ళెవరూ లేరు. గ్రామంలో అందరూ వాణ్ణి వ్యర్థుడని పిలిచేవాళ్ళు.

వాడు గ్రామంలోని విరూపాక్షాలయాన్ని అంటిపెట్టుకుని, దైవసందర్శనార్థం వచ్చే సాధుసన్యాసులకు సేవలు చేస్తూండేవాడు. వాడికి చిన్నప్పటి నుంచీ, అద్భుతశక్తులు సాధించాలనే కోరిక వుండేది.

ఒకసారి, హిమాలయ ప్రాంతాలవాడైన హఠయోగి ఒకడు, దేశాటనచేస్తూ, వ్యర్థుడుండే గ్రామానికి వచ్చాడు. ఈ హఠయోగి వయోవృద్ధుడేగాక, అనారోగ్యంతో బాధ పడుతూండేవాడు. వ్యర్థుడు ఆయనకు సేవలు చేస్తూ, క్రమంగా హఠయోగి ఆదరణ సంపాయించాడు.

కొన్నాళ్ళ తర్వాత, హఠయోగి తనకు మరణం ఆసన్నమైనదని గ్రహించి, వ్యర్థుడితో, ''ఒరే, బాబూ! నీ మనోవాంఛ నాకు తెలుసు. ఇన్నాళ్ళుగా నీవు నాకు చేసిన సేవలకుగాను, తగిన మేలు చేస్తాను,'' అని, వాడి శిరస్సు మీద చేయి పెట్టి, ఏదో మంత్రం చదివి, ''ఈనాటి నుంచి నువ్వు ఎలాంటి కలకన్నా, అది జరిగి తీరుతుంది! అందువల్ల, నీకు లాభం కలగడం, కలగకపోవడం అనేది, నీ ప్రాప్తాన్నిబట్టి వుంటుంది,'' అని చెప్పాడు.

తర్వాత, హఠయోగి మరణించాడు. వ్యర్థుడు అతడికి కర్మక్రతువులు జరిపి, తన అదృష్టాన్ని పరీక్షించుకునేందుకు, రాజధానీనగరమైన అనంతగిరికి బయలు దేరి, నగరపొలిమేరల్లో వున్న, ఒక సత్రంలో బసచేశాడు.

వీరేపల్లి జయరాంరెడ్డి



సత్రంలో చాలా మంది బాటసారులున్నారు. వాళ్ళు, రాజైన శివవర్మను గురించి గొప్పగా చెప్పుకోవడం, వ్యర్థుడి చెవినపడింది. రాజు దానగుణంలో శిబి అంతటివాడని ఒకరంటే, పరాక్రమంలో భీష్ముడంతటివాడని మరొకరన్నారు.

ఇదంతా విన్నాక వ్యర్థుడు, అంత గొప్ప రాజు ప్రాపకం సంపాయిస్తే చాలు, సుఖంగా కాలం గడపవచ్చని ఆలోచిస్తూండగా నిద్రపట్టింది. ఆ నిద్రలో వాడి కొక కల వచ్చింది: అర్ధరాత్రివేళ రాజుచేత కత్తి బట్టి, ఒంటరిగా రాజవీధుల్లో పర్యటిస్తూండగా, ఒక ముసలివాడు, ఆయనకు ఏవో మూగసైగలు చేసి పిలిచాడు.

రాజు, వాడి వెంటపోయి, ఒక శిథిల గృహాన్ని చేరి, చుట్టూ పరికిస్తూండగా, ముసలివాడు అదృశ్యమైపోయాడు. ఆ వెంటనే పెద్ద సుడిగాలి లేచి శివవర్మను భూమిపై నుంచి, తాడిచెట్టంత ఎత్తున పైకిలేపి, దూరంగా విసిరివేసింది. అదృష్ట వశాత్తూ, శివవర్మ చాపులనున్న కొలనులో పడి ప్రాణాలు దక్కించుకున్నాడు.

మర్నాటి ఉదయం వ్యర్థుడు, రాజు శివవర్మ దర్శనం చేసుకుని, తన గురించి చెప్పుకుని, రాత్రి తనకు వచ్చిన కల సంగతి విన్నవించాడు.

రాజు, వాడు చెప్పింది విని నవ్వి, "పొట్టకూటికి యిన్ని అబద్ధాలాడడం ఎందుకు?" అని, పదిపరహాలు యిప్పించి పంపేశాడు.

వ్యర్థుడు దిగులుగా తిరిగి సత్రం చేరాడు.

ఆ మర్నాడే వాడికి, రాజు నుంచి కబురు వచ్చింది. రాజు ఆప్యాయంగా వ్యర్థుడి భుజం తట్టి, "నువ్వు నిన్న చెప్పింది, రాత్రి నిజంగానే జరిగింది. ఏదో దుష్టశక్తికి బలికాబోయి, దైవికంగా బతికాను. జరిగింది ఏమైనా—నువ్వు ముందుగానే, దాన్ని గురించి కలగనడం అద్భుతం! నీకు, నా కొలువులో ఎలాంటి పని కావాలో కోరుకో," అన్నాడు.

వ్యర్థుడు, తనకు గుర్రపుస్వారీ అంటే ఎంతో యిష్టమని చెప్పగానే, రాజు వాణ్ణి అశ్వశాల అధికారిగా నియమించాడు. వాడు, ఆ రోజు నుంచి తనకు నచ్చిన అశ్వాన్ని అధిరోహించి, నగరంలో విలాసంగా తిరగసాగాడు.

ఇలా కొద్ది రోజులు గడిచాక, ఒకనాడు వ్యర్థుడు, రాజు శివవర్మను చూడబోయి, ''మహారాజా, రాత్రి నాకు చాలా చెడ్డ కల వచ్చింది!'' అన్నాడు.

''భయం లేదు. అదేమిటో చెప్పు. వింటాను.'' అన్నాడు రాజు.

అప్పుడు వ్యర్థుడు, ''మీరు కొలువు తీరి వుండగా, అక్కడికి ఒక తాపసి వచ్చాడు. ఆయన మీతో, 'ఓ, రాజా! నేనెవరైందీ యిప్పుడు నువ్వు గుర్తుపట్ట లేవు. ఒకప్పుడు, నా ప్రియ శిష్యుడివి, నువ్వు. రాజభోగాలపై ఆశగల నీకు, పదేళ్ళపాటు వాటిని అనుగ్రహించాను. నేటితో వాటి గడువు తీరిపోయింది. ఇక, నా వెంట బయలుదేరు!' అని, తమపై మంత్రజలం చల్లి, మీకు మీ పూర్వ జీవితం కళ్ళకు కట్టేలా చేశాడు.

''ఆ మరుక్షణం మీరు, ఆ తపస్వితో. చిత్తం, గురుదేవా! తమ వెంట తప్పక వస్తాను.' అని, పక్కనే వున్న, నా కేసి చూసి, మీ కిరీటాన్ని, నా తలపైపెట్టి, వేలికి రాజముద్రిక తొడిగి, 'నేటితో నా బాధ్యత తీరింది. ఇక, యీ రాజ్యం, ప్రజలభారం, నీదేసుమా!' అన్నారు'' అని చెప్పాడు.





రాజు శివవర్మ, వ్యర్థుడి కల గురించి విని నివ్వెరపోయాడు. ఆయన కొద్దిసేపు మౌనంగా తల వంచుకుని, తర్వాత సింహాసనం మీది నుంచి లేచి, అంతః పురంలోకి వెళ్ళిపోయాడు.

మరుసటిరోజు ఉదయం, అంతా వ్యర్థుడు కల గన్నట్టే జరిగింది. శివవర్మ, నిండు కొలువుకు విచ్చేసిన తాపసి గురువు వెంట వెళ్ళిపోతూ, వ్యర్థుడికి కిరీటం యిచ్చాడు. సభికులు పాత రాజుపై ప్రేమ కొద్దీ, ఒకవైపున విచారిస్తూనే, కొత్త రాజుకు జయజయధ్వానాలు చేశారు.

ఆ సమయంలో అక్కడికి ఒక వార్తాహరుడు వచ్చి, వ్యర్థుడితో, "మహారాజు గారు, యీ శుభసందర్భంలో, నేను యీ విచారకరమైన వార్తను మోసుకువచ్చినందుకు మన్నించాలి. మన పాతశత్రువు అనంతసేనుడు, మనపై మరొకసారి కత్తి దూశాడు. మన సేనలు సర్వసన్నద్ధమై, మీ సారథ్యం కోసం ఎదురు చూస్తున్నవి," అని చెప్పాడు.

ఇది విని వ్యర్థుడు నివ్వెరపోయాడు. కత్తిపట్టడమే చేతకాని తను, శత్రుసేనలతో యుద్ధానికి, సైన్యాన్ని నడపడమా! ఇప్పుడెలా, యీ గండం నుంచి బయటపడడం—అని కలవరపడుతూ, మంత్రిని పిలిచి, "ఈ అనంతసేనుడు మరొకసారి మనపైకి యుద్ధానికి వస్తున్నాడంటే, చాలా పెద్ద సైనికబలాన్ని సమకూర్చుకుని వుంటాడు. సంధికి ఒప్పుకుంటాడేమో ప్రయత్నించండి!" అని, కొలువులోంచి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి, హంసతూలికాతల్పం మీద పడుకున్నా నిద్రపట్టని వ్యర్థుడికి, బాగా పొద్దుపోయాక, చిన్న కునుకుపట్టింది. అప్పుడు వాడి కొక కల వచ్చింది. కలలో వాడు కట్టుబట్టలతో రాజప్రాసాదం వదిలి పారిపోబోతూండగా, ఎవరో వాణ్ణి తరిమి పట్టుకున్నారు! కల చెదిరిపోయింది.

వ్యర్థుడు పెద్దగా మూలుగుతూ లేచి, కలలో మాదిరిగానే పారిపోతూండగా,

ద్వారం దగ్గిర కాపలాభటుడి వేషంలో వున్న, రాజు శివవర్మ వాణ్ణి పట్టుకున్నాడు.

భటుడి వేషంలో వున్న రాజును గుర్తించిన వ్యర్థుడు, నిలువెల్లా వణికిపోసాగాడు. శివవర్మ, వాడి వీపుతట్టి, ''భయపడకు! నువ్వు భవిష్యత్తును చెప్పగల స్వప్న సాముద్రికుడివనుకున్నాను. కాని, నిన్ను పట్టిన క్షుద్రశక్తి, నువ్వు కలగన్నదే జరిగేలా చేయగలదు. తొలిసారి నీ కల, నా మేలు కోరికన్నది. నా ధర్మగుణం గురించి విన్న నువ్వు, మంచి బుద్ధితో, నా ప్రాణగండం తప్పించే కల కన్నావు, అవునా?'' అన్నాడు.

''అవును, మహారాజా! సత్రంలో చేరిన బాటసారులు, మీ దయాదాన గుణాలను గురించిపొగుడుతుండగా, విన్నాను,'' అన్నాడు వ్యర్థుడు వణికిపోతూ.

రాజు శివవర్మ మందహాసం చేసి, ''తర్వాత, నా ఆశ్రయంలో నీ మనసు మారి, స్వార్థం చోటు చేసుకున్నది. అయినా, నాకు ప్రాణహాని తలపెట్టే యోచన నీలో కలగలేదు. రాజపదవిపై వున్న ఆశకొద్దీ, రెండవ కల గన్నావు. ఇప్పుడు నీలో భీతి ఏర్పడడంతో, పారిపోయేందుకు, యీ మూడవ కల గన్నావు. ఇవన్నీ, నీ మనసు కల్పన చేసిన కలలే! అవి ఎలాగూ జరగాలి కనక, నీ అసలు తత్వాన్ని గ్రహించేందుకు, రెండవ కల జరిగినట్లు నాటకం ఆడించాను. నా సన్యాసం, శత్రురాజు దాడి—అన్నీ నా కల్పనలే!'' అన్నాడు.

వ్యర్థుడు కళ్ళనీళ్ళు పెట్టుకుని, రాజు పాదాలముందు మోకరిల్లాడు. రాజు, వాణ్ణి లేవమని, ''నీవంటి చపలచిత్తుడు, నా కొలువులో వుండడం క్షేమం కాదు. అదుగో, ఆ ఆసనం మీది మూటలో, వెయ్యి బంగారునాణాలు వున్నవి, అవి తీసుకుని, ఎక్కడికైనా పోయి, చేతనైన పని చేసుకుని బతుకు,'' అన్నాడు.

వ్యర్థుడు, వంగి రాజుకు నమస్కరించి, నాణా లున్న మూట తీసుకుని, రాత్రికి రాత్రే రాజప్రాసాదం వదిలిపోయాడు.





# మొదటిదొంగతనం

గోపయ్య, చంద్రయ్య అనే స్నేహితులిద్దరు, తాము పుట్టి పెరిగిన గ్రామంలో బతుకుతెరువు కష్టం కాగా, నగరం చేరి, ఉద్యోగం కోసం చాలా ప్రయత్నాలు చేశారు. అయినా, ఎక్కడా ఉద్యోగం దొరికింది కాదు. చివరకు వాళ్ళు, ఎక్కడైనా దొంగతనం చేసి, ఆ డబ్బుతో తమ గ్రామానికి పారిపోవాలనుకున్నారు.

వాళ్ళు పగలంతా వీధుల వెంట తిరిగి, చీకటిపడేవేళకు, తాళం వేసి వున్న ఒక ఇంటిని ఎంచుకున్నారు. మారు తాళం చెవులతో, తాళాలు తియ్యడంలో గోపయ్యకు కొంత నేర్పు వున్నది. అతడు ఇంటి తాళం తీశాక, చంద్రయ్య లోపలికి వెళ్ళి, దొరికిన విలువైన వస్తువులతో, పెరటి గుమ్మం నుంచి బయటికి రావాలి. అంతవరకు గోపయ్య వీధిలో కాపలా వుంటాడు. ఇదీ పథకం.

చంద్రయ్య ఇంట్లోకి వెళ్ళాడు గాని, విలువైన వస్తువులేమీ కనిపించలేదు. వంటగదిలో రాగి, ఇత్తడిపాత్రలు మాత్రం వున్నవి. ఒక గదిలో ఇనుపపెట్టె ఒకటున్నది. డబ్బూ, నగలూ ఇంటివాళ్ళు అందులో దాచి వుంటారు.

చంద్రయ్య పెరటిదారిన వచ్చి, గోపయ్యను కలుసుకుని, సంగతి చెప్పాడు. ఇద్దరూ కలిసి, ఆ ఇల్లు ఎవరిదో వివరాలు సేకరించారు. అది నీలకంఠయ్య అనే వెండినగల వ్యాపారిది. ఆయన భార్యాపిల్లలు పొరుగూరు వెళ్ళారు.

గోపయ్య, చంద్రయ్యతో, "నువ్వు లోపలికి వెళ్ళి అటక మీద దాక్కో. నీలకంఠయ్య వచ్చి నిద్రపోగానే జాగ్రత్తగా తాళాలు దొంగిలించి, ఇనుపపెట్టెలో వున్న డబ్బూ, నగలూ తీసుకుని బయటికిరా!" అన్నాడు.



"ఒకవేళ నీలకంఠయ్య మధ్యలో నిద్రలేస్తే?" అన్నాడు చంద్రయ్య.

"దానికి, నా దగ్గిర ఒక మందున్నది." అని గోపయ్య, చంద్రయ్యకు ఒక చిన్న సీసా యిచ్చి, "దీని మూత తీసి నీలకంఠయ్య ముక్కు దగ్గిర వుంచు. అయన తెల్లవారేవరకూ నిద్రలేవడు." అన్నాడు.

తర్వాత, అతను ఇంటి తాళం తీశాడు: చంద్రయ్య లోపలకు వెళ్ళగానే, తలుపు మూసి ఎప్పటిలా తాళం వేశాడు. చంద్రయ్య అటక ఎక్కి దాక్కున్నాడు.

చాలా పొద్దుపోయాక, నీలకంఠయ్య వచ్చాడు. స్నానం, భోజనం ముగించి, ఏవో చిఠాపుస్తకాలు ముందేసుకుని లెక్కలు చూసుకుంటూ కూర్చున్నాడు. అటక మీద దాక్కున్న చంద్రయ్యకు నిద్ర ముంచుకురాసాగింది.

కొంతసేపటికి నీలకంఠయ్య లేచి, నిద్రపోదామని పక్క దులుపుకుంటూండగా, వీధితలుపు చప్పుడైంది.

"ఎవరూ?" అన్నాడు నీలకంఠయ్య.

"రామాపురం నుంచి వస్తున్నానయ్యా! మీ మామగారు పంపించారు. మీ పెద్దబ్బాయిని పాము కరిచింది." అన్నాడు తలుపు తట్టినవాడు.

నీలకంఠయ్య కంగారుపడుతూ పోయి, తలుపు తెరిచాడు. వెంటనే, వచ్చినవాడు మెరుపులా లోపలికి వచ్చి, తలుపులు మూసేసి, కత్తి చూపిస్తూ, అరిస్తే చంపుతానని, నీలకంఠయ్యను బెదిరించాడు.

"ఎవరు నువ్వు?" అన్నాడు నీలకంఠయ్య భయపడుతూ.

"తెలియడం లేదా? దొంగను! ఇనప్పెట్టె తెరిచి, మర్యాదగా నగలన్నీ యిచ్చెయ్యి." అన్నాడు దొంగ.

నీలకంఠయ్య ఒప్పుకోక, పారిపోయేందుకు వెనుదిరిగాడు. వెంటనే దొంగ, ఆయన మెడపట్టుకుని కత్తి ఎత్తాడు. మరుక్షణం, చంద్రయ్య అటకమీది నుంచి కిందికి దూకి, దొంగ చేతిలోని కత్తి కింద పడేలా, వాడి చేతి మీద కొట్టాడు.

దొంగ ఒక క్షణం నివ్వెరపోయి, తేరుకుని చంద్రయ్య మీదికి దూకబోయేంతలో, నీలకంఠయ్యా, చంద్రయ్య వాణ్ణి వడిసి పట్టుకుని, తాళ్ళతో బిగించి కట్టారు.

తర్వాత నీలకంఠయ్య వీధిలోకి వెళ్ళి, ఇద్దరు రాజభటులతో తిరిగి వచ్చి, వాళ్లకు జరిగినది చెప్పాడు. భటులు దొంగను తీసుకుపోయారు.

ఏం చేయాలో తోచక దిక్కులు చూస్తున్న చంద్రయ్యను, "నువ్వెవరివి? నా ఇంటి అటక మీదికి ఎలా వెళ్ళగలిగావు?'' అని ప్రశ్నించాడు నీలకంఠయ్య.

చంద్రయ్య వణుకుతూ, ''అయ్యా, నన్ను క్షమించండి!'' అని తనూ, గోపయ్యా నగరానికి ఎందుకొచ్చిందీ, తాను ఇంట్లో ఎలా ప్రవేశించిందీ చెప్పి, ''మా ఎత్తుగడ పారకముందే, వీడెవడో యింకొక దొంగ ఇంట చేరాడు.'' అన్నాడు.

నీలకంఠయ్య, క్షణం మౌనంగా వూరుకుని, తర్వాత చంద్రయ్యను, ''ఇదే, నీ మొదటి దొంగతనం కదా?'' అని అడిగాడు.

''అవును,'' అన్నాడు చంద్రయ్య భయంగా.

''నువ్వు పాతదొంగవే అయి వుంటే, నన్ను రక్షించేవాడివి కాదు. ఆ దొంగ నన్ను చంపాక, వాణ్ణి బెదిరించి, దొంగిలించిన సొమ్ములో సగం వాటా తీసుకునేవాడివి,'' అన్నాడు నీలకంఠయ్య.

''అలాగే జరిగేదేమో! మీరు ఎదురు తిరిగితే చంపాలనుకున్నాను. కాని, ఆ దొంగ మిమ్మల్ని చంపబోతూంటే చూడలేక పోయాను. చాలా ఆశ్చర్యంగా వున్నది!'' అన్నాడు చంద్రయ్య.

నీలకంఠయ్య నవ్వి, ''ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఎంత దుష్టుడైనవాడిలో కూడా, అంతో యింతో మానవత్వం దాగి వుంటుంది. అది కొన్ని కొన్ని సమయాల్లో బైటపడుతుంది.'' అన్నాడు.

ఆ తర్వాత, నీలకంఠయ్య, గోపయ్యా, చంద్రయ్యలకు, తన దగ్గిర ఉద్యోగాలిచ్చాడు. వాళ్ళు ఎంతో నమ్మకంగా పని చేస్తూ, నగరంలోనే స్థిరపడిపోయారు.






## 4

[పురాతన శిథిలాల మధ్య కనిపించిన బంగారు స్త్రీ విగ్రహానికి, వినోదుడు రక్షణ ఏర్పాటు చేసి, జలపాతం దాటి జ్ఞానభూమిని చేరుకున్నాడు. అక్కడి పూజారి నుంచి తప్పించుకుని పారిపోతూన్న వినోదుణ్ణి భటులు వెంబడించారు. కొంత దూరం వెళ్ళాక, వాళ్ళు చిన్న కొండ కేసి చూస్తూ నిలబడిపోయారు. వినోదుడు కూడా అటు కేసి చూశాడు. తరవాత—]

ఆ కొండశిఖరం మీద రాజకుమారుడి లాంటి విలువైన దుస్తుల్లో, అందమైన ఐదారేళ్ళ పసివాడొకడు, చలనం లేకుండా నిలబడి ఉన్నాడు. భయంకరమైన ఒక మహామృగం, ఆ పసివాడి కేసి ప్రాకుతూ వెళుతున్నది!

"యువరాజు! యువరాజునే ఆ పవిత్ర మహామృగం భక్షించపోతున్నది!" అనుకున్నారు తమలో తాము సైనికులు.

"యువరాజును భక్షించనున్నదని తెలిసి ఎందుకలా స్థాణువుల్లాగా నిలబడ్డారు? వెంటనే దానిని చంపండి," అన్నాడు వినోదుడు, మొలలో ఉన్న కత్తి మీద చేయి వేస్తూ

సైనికులు అతణ్ణి వింతగా చూడసాగారు'

అప్పుడే అక్కడికి ఒక రథం వచ్చింది. ఆ రథాన్ని ఇద్దరు స్థూలకాయులు వాయు

మనోజ్ దాస్



ఇంతలో మహామృగం యువరాజును సమీపించి, అతణ్ణి మింగడానికి, అగ్ని జ్వాలవంటి తన నాలుకను సాచింది. ఆ క్షణమే, వినోదుడు కత్తి దూసి మెరుపులాగా ఒక్క ఉరుకున వెళ్ళి, దాని తలను తెగవేశాడు! దాని తల ఎగిరి దూరంగా పడి, అక్కణ్ణించి దొర్లుతూ వెళ్ళి, రాజుగారి రథం పక్కన పడింది. ఆఖరుసారిగా దాని ముక్కుపుటాల నుంచి వెలువడిన అగ్నిజ్వాలకు, అప్పుడే అక్కడికి వచ్చిన గూనివాడి గడ్డం కొంత కాలిపోయింది!

''ఏమిటి? ఏం చేశావు?'' అని అడిగాడు గూనివాడు వినోదుణ్ణి.

వేగంతో లాక్కు రావడం చూసి వినోదుడికి ఆశ్చర్యం కలిగింది.

''మహారాజుకు, జై,'' అంటూ రథంలో వున్న రాజుకు సైనికులు నమస్కరించారు.

రాజు మాత్రం ఆ పసివాణ్ణి చూస్తూ, ''నాయనా, నన్ను వదిలి వెళుతున్నావా?'' అంటూ విలపించసాగాడు.

''ఆ మృగాన్ని చంపి, తమ కుమారుణ్ణి రక్షించమని సైనికులను ఆజ్ఞాపించండి, మహారాజా!'' అన్నాడు వినోదుడు.

రాజు, ఒక క్షణం వినోదుడి కేసి వింతగా చూసి, మళ్లీ కుమారుడి కేసి విచారంగా చూడసాగాడు.

''యువరాజును మింగబోయిన భయంకర మృగాన్ని హతమార్చాను. అందుకు బహుమానంగా నాకు రాకుమారి నిచ్చి పెళ్ళి చేసి, అర్ధరాజ్యం ఇచ్చినా చాలదు. అయినా, అవన్నీ నేను కోరడం లేదు,'' అన్నాడు వినోదుడు.

''ఈ దుర్మార్గుణ్ణి పట్టి బంధించండి,'' అని భటులను ఆజ్ఞాపించాడు గూనివాడు.

''అవును, వాణ్ణి పట్టుకుని, రాజభవనం దాపులనున్న కారాగారంలో పడవేయండి,'' అన్నాడు రాజు.

ఈలోగా, యువరాజు కొండపై నుంచి కిందికి దిగివచ్చి, వినోదుణ్ణి ఎంతో కృతజ్ఞతగా చూడసాగాడు. భటులు,



వినోదుణ్ణి బంధించి కారాగారానికి నడిపించారు.

వెనకగా వస్తూన్న రాజూ, గూనివాడూ, వింతమృగం శవాన్ని ఎక్కడ పాతిపెట్టి, ఎటువంటి స్మారకమందిరం నిర్మించాలన్న విషయం గురించి మాట్లాడుకోవడం వినోదుడికి వినిపించింది.

కారాగారంలో బంధించబడిన వినోదుడికి అర్ధరాత్రి దాటినా నిద్రపట్టలేదు. ఆ భయంకర మృగం చచ్చినందుకు, రాజూ, గూనివాడూ ఎందుకు అంతగా బాధపడిపోయారు? యువరాజును కాపాడినందుకు బహూకరించడానికి బదులు తన కెందుకీ కారాగారశిక్ష విధించారు?

అర్ధరాత్రి సమయంలో హఠాత్తుగా కారాగారం తలుపులు తెరుచుకున్నాయి. అంగరక్షకులు కూడా లేకుండా రాజు ఒంటరిగా లోపలికి ప్రవేశించాడు.

"నువ్వు నా కుమారుణ్ణి కాపాడినందుకు సర్వదా కృతజ్ఞుణ్ణి. నువ్వు మరణించడం నాకు ఇష్టం లేదు," అన్నాడు రాజు వినోదుడితో.

"తమ దయకు కృతజ్ఞుణ్ణి, మహారాజా! అయినా, ఎవరయినా సరే నా మరణాన్ని ఎందుకు కోరుకుంటారు?" అని అడిగాడు వినోదుడు.

"ఇది జ్ఞానభూమి అన్న విషయం నీకు తెలుసు. జ్ఞానార్జనకు క్రమశిక్షణ చాలా అవసరం. క్రమశిక్షణకు అధిదేవత ఆ మహామృగం. దానిని మేము పవిత్ర మహా మృగంగా భావిస్తాము. అది రోజుకు ఒక్కతిని మాత్రమే భక్షిస్తుంది. దాని కోరిక నెరవేర్చడం మా క్రమశిక్షణలో ఒక భాగం. రాజయినంత మాత్రాన నేను క్రమశిక్షణను అతిక్రమించలేను కదా!" అన్నాడు రాజు.

"ఆ భీకరమృగం క్రమశిక్షణకు అధిదేవత ఎలా అయింది, మహారాజా!" అని అడిగాడు వినోదుడు.

"నాకు తెలిసిన రహస్యం చెబుతాను. ఆ మహామృగం కేవలం ఒక రాక్షస

జంతువు మాత్రమే. అయితే, సామాన్య ప్రజలు తాము పాటిస్తున్న క్రమశిక్షణకు ఒక అధిదేవత ఉన్నదన్న భయం వుంటే తప్ప, దానిని పాటించరు. అధిదేవత ఎంత భయంకరంగా వుంటే, ప్రజలు అంత క్రమశిక్షణను భయాసక్తులతో అచరిస్తారు!'' అన్నాడు రాజు.

''మహారాజా! మీ రథానికి గుర్రాలకు బదులు, మానవులను పూన్చమని మీ జ్ఞానం మీకు చెబుతున్నదా?'' అని అడిగాడు వినోదుడు.

రాజు వినోదుడి వెన్నుచరిచి, ''నీకు మానవులుగా కనిపించినవాళ్ళు నిజానికి గుర్రాలే. గుర్రాలకు మేము మానవరూపాలు ఇచ్చాము. అలాగే కావాలంటే మేము మనుషుల్ని గుర్రాలుగా మార్చగలం. దానినిబట్టి మాకున్న విజ్ఞానశాస్త్రశక్తిని నువ్వు గ్రహించవచ్చు,'' అన్నాడు రాజు.

''గ్రహించాను, మహారాజా!'' అన్నాడు వినోదుడు చిరునవ్వుతో.

''ఏం గ్రహించావు?'' అని అడిగాడు రాజు అనుమానంగా.

''నిరుపయోగమైన జ్ఞానంపట్ల, మీకున్న గుడ్డిదాహనికి, అధిదేవతగా ఆ క్రూరమైన రాక్షసమృగం మాత్రమే ఉండగలదన్న విషయం గ్రహించాను,'' అన్నాడు వినోదుడు.



రాజు కొంతసేపు మౌనంగా ఊరుకుని, ''జ్ఞానభూమిలో మేము సాధిస్తూ వున్న అద్భుత కార్యాలను చూడాలంటే, నాతో రా,'' అంటూ ముందుకు నడిచాడు.

వినోదుడు మౌనంగా రాజును అనుసరించాడు.

వంకరటింకరగా ఉన్న మెట్లమీదుగా వెళ్ళి, ఇరువురూ రాజభవనం ఉపరితలం చేరారు. అక్కడ ఒక మూలలో, గుమ్మటంలాగా తెల్లగా మెరుస్తున్న బురుజు కనిపించింది. బురుజు మధ్యగా ఎరుపురంగు గుండ్రటి మరక ఉన్నది. రాజు తన చేతితో దానిని మూడుసార్లు తాకాడు. మరక మాయమై దాని స్థానంలో



ద్వారం తెరుచుకున్నది. రాజు లోపలికి ప్రవేశిస్తూ, "ఇది చాలా ప్రత్యేకమైన బురుజు. ఇందులోనుంచి, జ్ఞానభూమిలో ఏ మారుమూల ఏమి జరుగుతున్నదో ప్రత్యక్షంగా చూడవచ్చు; స్పష్టంగా వినవచ్చు. అన్నీ పక్కన జరుగుతున్నట్టే ఉంటుంది. ఇదో దీని గుండా చూడు," అంటూ గోడలో అద్దంలాగా ఉన్న స్థలం చూపాడు.

వినోదుడు అందులోకి తొంగి చూశాడు. వివిధ భాగాలుగా విభజింపబడి ఉన్న పట్టణం అతనికి కనిపించింది. కళ్ళు మిరుమిట్లు కొలిపే వెలుతురులో స్త్రీ పురుషులు ఏవేవో పనులలో నిమగ్నులై ఉన్నారు. అయినా, వాళ్ళేం చేస్తున్నారో వినోదుడికి అర్థం కాలేదు.

"వాళ్ళంతా ఏం చేస్తున్నారు, మహా రాజా!" అని అడిగాడు వినోదుడు.

"ఒక్కటికాదు; వందల కొలది పనులు చేస్తున్నారు. మాకు ఎన్నో పథకాలు ఉన్నవి. అదిగో, ఎడమవైపు చూడు; అక్కడ కొందరు గణితశాస్త్రజ్ఞులు, మా రాజ్యంలో ఉన్న ఇసుకరేణువుల సంఖ్యను లెక్క కట్టడానికి కావలసిన సూత్రం కనుగొనడానికి కృషి చేస్తున్నారు!" అన్నాడు రాజు.

"అటువంటి సూత్రంవల్ల ప్రయోజనం ఏమిటి, మహారాజా?" అని అడిగాడు వినోదుడు.

"ప్రయోజనమా! జ్ఞానమే బలమన్న సంగతి నువ్వెరుగవా? ఏ జ్ఞానం ఎప్పుడు పనికివస్తుందో చెప్పలేముకదా! అందుకనే, అన్ని శాఖలకు సంబంధించిన జ్ఞానాన్నీ, సేకరించి, భద్రపరుస్తున్నాము. అదిగో, ఆ కనిపిస్తున్నదే కాంతిగోపురం! అటు చూడు. మహోన్నతమైన దానిని కనుగొనడానికి మా శాస్త్రవేత్తలు అక్కడ నిర్విరామంగా పరిశోధనలు జరుపుతున్నారు. మా పరిశోధనలకన్నింటికీ ఆ పరిశోధన తలమానికం వంటిది!" అన్నాడు రాజు.



"అటువంటి గొప్ప పరిశోధన ఏమిటి మహారాజా!" అని అడిగాడు వినోదుడు.

"అలా అడుగు చెబుతాను. కావాలనుకుంటే, మేము మునుముందు ఇక్కడి నుంచే నక్షత్రాలను తుత్తునియలుగా ధ్వంసం చేయగలం! దానిని సాధించడానికే ఆ పరిశోధన!" అన్నాడు రాజు సగర్వంగా.

"మూర్ఖత! క్రూరకృత్యం!" అన్నాడు వినోదుడు.

"ఏమిటా పొగరు?" అన్నాడు రాజు కోపంగా.

"కాకుంటే, అమాయకంగా మెరిసే ఆ చుక్కలు మీకేం అపకారం చేశాయి మహారాజా! వాటినెందుకు ధ్వంసం చేయాలి," అన్నాడు వినోదుడు.

"నువ్వు అనుకునేటంత, అమాయకమైన చిన్న నక్షత్రాలు కావు నాయనా! అవి, మన భూమికన్నా చాలా పెద్దవి! వాటి మీద మనకన్నా శక్తిసంపన్నులయిన మానవులు నివసిస్తూ వుండవచ్చు. ఏ క్షణంలోనైనా వాళ్ళు మన మీద దాడి జరపవచ్చు కదా! అందువల్ల మన రక్షణ మనం చూసుకోవడంలో తప్పేమిటి?" అని అడిగాడు రాజు.

"అర్థం లేని అనుమానంతో మీరు అద్భుతమైన మానవశక్తిని వృథా చేస్తున్నారు, మహారాజా! మీరన్నట్టు, ఒకవేళ నక్షత్రమండలాల నుంచి మానవులే వచ్చినా, వారు ప్రేమానురాగాలతో ఎందుకు రాకూడదు? అయినా మీ పరిశోధనలకంతటికీ భయమే ఎందుకు ఆధారం కావాలి?" అన్నాడు వినోదుడు.

"భయం ఉండడంలో తప్పేమిటి? భయమేకదా మనుషు లందరినీ కలిసి కట్టుగా ఉండేట్టు చేసేది!" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"బందిపోటు దొంగలకు భయపడి కూడా అందరూ అప్పటికి ఐకమత్యంగా ఉంటారు. అయినా అటువంటి ఐకమత్యం ఆశించతగినదేనా? అదిసరే, ఈ అపరాత్రి

వేళ మీ ప్రజలెందుకు నిద్రపోరు ?" అని అడిగాడు వినోదుడు.

"నిద్రపోవడమా! నిద్రను మరిచి పోవడానికి కావలసిన ఉపాయం మేము కనుగొన్నాము! నిద్రపోకుండా పదేళ్ళు పాటు గడిపినవారిని మేము మహామృగ పతకంతో సత్కరిస్తాము," అన్నాడు రాజు.

"నిద్రపోకపోతే ఆరోగ్యానికి హానికరం కదా!" అని అడిగాడు వినోదుడు.

"నిద్రలేమి కారణంగా, అనారోగ్యానికి గురి కాకుండా ఉండడానికి కూడా, మేము ఒక మార్గాన్ని కనిపెట్టాము," అంటూ రాజు, మరొక ప్రదేశాన్ని చూపుతూ, "ఇదిగో, ఈ మంటపం కేసి చూడు. మా పూజారి కొందరికి విలాప సమావేశం ఏర్పాటు చేశాడు," అన్నాడు.

వినోదుడు అటు కేసి చూశాడు. విశాలమైన మంటపం మధ్య గోడ మీద బ్రహ్మాండమైన మహామృగం చిత్తరువు చిత్రింపబడి ఉన్నది. మంటపం నిండా జనం విచారవదనాలతో, తలలు వేలాడవేసుకుని కూర్చున్నారు. పూజారి ఎత్తయిన వేదిక మీద నిలబడి, ఇలా అన్నాడు:

"పూజనీయమైన మన మహామృగం హత్య చేయబడిన ఉదంతం మీరు వినే ఉంటారు. మన జ్ఞానభూమిలోకి అక్రమంగా ప్రవేశించి, ఆ మహామృగాన్ని చంపినవాడు సామాన్యుడు కాడు; మానవ రూపంలో ఉన్న రాక్షసుడన్న సంగతి మీకు నేను చెప్పనవసరం లేదు. మన అజ్ఞాతశత్రువు లెవరో వాణ్ణి పురికొలిపి మన మీదికి పంపి ఉంటారు. వాడు చాలా తెలివిగల దుర్మార్గుడు. మహామృగం యువరాజును కబళించనున్న సమయం చూసి, దానిని హతమార్చి, రాజుగారి సానుభూతి పొందాలని చూశాడు. అయినా, మేమువాణ్ణి బంధించాము!"

"ఆ అబద్ధాలకోరు చెబుతున్నదంతా మీరు నమ్ముతున్నారా మహారాజా!" అని అడిగాడు వినోదుడు కోపావేశంతో.

రాజు ఏమీ మాట్లాడలేదు. వినోదుడి కేసి అనుమానంగాచూశాడు.—(ఇంకావుంది)






# రాక్షసరాజు పరిహాసం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, తన్నుమాలిన ధర్మం, మొదలు చెడ్డ బేరం, అన్న సామెత వినే వుంటావు. ఏదో అన్న మాట నిలబెట్టుకునేందుకు, నువ్వీ అర్ధరాత్రివేళ ఎనలేని యిక్కట్లపాలవుతున్నావన్న అనుమానం కలుగుతున్నది. రాక్షసరాజంతటివాడు, తన జ్ఞాతికి మేలు కాదని భావించి, అన్న మాట నిలబెట్టుకోక పోవడమే కాక, శక్తిమంతుడైన మహారాజును కూడా పరిహాసం చేశాడు. నీకు శ్రమతెలియకుండా, ఆ కథ చెబుతాను, విను," అంటూ యిలా చెప్పసాగాడు:

మగధదేశపురాజు మాధవసేనుడు, ఒక అర్ధరాత్రివేళ మారువేషంలో నగర

## బేతాళ కథలు



సంచారం చేస్తూ దారిలో ఒక విచిత్రం చూశాడు.

ఒక చెట్టుకింద, పెద్ద పందికొక్కొకటి నిద్రపోతున్నది. పిల్లి ఒకటి, కుక్కకు భయపడి పరిగెత్తుకుంటూ, ఆ చెట్టు కిందికి వచ్చి, పందికొక్కును చూసి మరింత భయపడి పారిపోయింది.

మాధవసేనుడు పందికొక్కును చూసి, "నా రాజ్యంలో పందికొక్కులు, పిల్లిని కూడా భయపెట్టేంతగా, బలిసిపోయాయన్నమాట! వీటిని బతకనివ్వకూడదు," అనుకుంటూ, ఒరలో నుంచి కత్తి తీశాడు.

అయితే, యుద్ధంలో సాటివీరుల ప్రాణాలు తీయవలసిన ఆ కత్తితో, పందికొక్కును చంపడం యిష్టంలేక, తిరిగి కత్తిని ఒరలో పెట్టి, పక్కనే వున్న పెద్ద బండరాయిని ఎత్తాడు. కాని; నిద్రపోతున్న ఏ ప్రాణినీ చంపకూడదన్నది, ఆ రాజ వంశస్థుల నియమం. ఆ సంగతి గుర్తు రాగా, రాజు పందికొక్కును కాలితో అదిలించాడు.

అప్పుడా పందికొక్కు మానవాకారం ధరించింది.

మాధవసేనుడు ఆశ్చర్యపడి, "ఎవరు నువ్వు? పందికొక్కు రూపంలో, యిక్కడ ఎందుకు పడివున్నావు?" అని అడిగాడు.

"నేను రాక్షసరాజు ప్రచండుణ్ణి. ఒక ముఖ్యమైన పని మీద, భూలోకానికి వచ్చాను. నా ఆకారం చూస్తే భయపడతారని, మానవరూపంలో తిరుగుతున్నాను. నిద్రపోయేటప్పుడు, ఆరుబయట జంతువుల ప్రాణాలకున్న రక్షణ, మనిషి ప్రాణాలకు లేదని తెలిసి, పందికొక్కు రూపంలో నిద్రపోతున్నాను. నువ్వెవరు?" అని అడిగాడా వ్యక్తి.

మాధవసేనుడు మరింత ఆశ్చర్యపోయి, "మనిషి ప్రాణాలకు రక్షణ ఎందుకుండదు? నేను కాక మరెవరైనా, నిన్ను పందికొక్కు రూపంలో చూసివుంటే, నీ ప్రాణాలెప్పుడో పోయేవి." అని, తానెవరైనదీ తెలిపి, జరిగినదంతా చెప్పాడు.



రాక్షసుడు అంతా తలాడిస్తూ విని, "మా రాక్షసుల కిప్పుడొక నియమం వున్నది. మనిషిరూపు ధరించినప్పుడు, మమ్మల్ని మేము స్వశక్తితో కాపాడుకోవాలి. అయితే, అప్పుడు మాకు రాక్షసబలముండదు; మనిషికుండేటంత శక్తి మాత్రమే వుంటుంది. ఇతర జంతురూపంలో వుండగా, సృష్టిలోని, ఏ ప్రాణివల్లా మాకు ప్రమాదముండదు. ఏది ఏమైనా, నిన్ను కలుసుకున్నందుకు, నాకు చాలా సంతోషంగా వున్నది. మానవప్రభువుకు, నా వందనాలు," అంటూ మాధవసేనుడికి నమస్కరించాడు.

"నువ్వు, మా రాజ్యానికి వచ్చిన పనేమిటి ?" అని అడిగాడు మాధవసేనుడు.

"ఇటీవల మా రాక్షసపౌరులు కొందరు, భూలోక సంచారానికి వెళ్ళి, నరభక్షణ చేసి వచ్చారు. నరభక్షణ రాక్షసులకు నిషిద్ధం కాదు. కాని, మాకిప్పుడు కొన్ని కఠోర నియమాలున్నవి. ఆ ప్రకారం, రాక్షసులిప్పుడు ఆత్మరక్షణకు కూడా మనిషిని చంపకూడదు. ఏ జంతువైనా ఆహారం కోసం మనిషిని చంపితే, ఆ మనిషిని అపహరించి తినకూడదు. ఈ నియమాలవల్ల, రాక్షసులకిప్పుడు, నరభక్షణ సాధ్యం కాకుండా పోయింది," అన్నాడు రాక్షసుడు.

"అయితే, యిక్కడికొచ్చిన రాక్షసులు నరభక్షణ ఎలా చేయగలిగారు ?" అని అడిగాడు మాధవసేనుడు.

"అదే చెప్పబోతున్నాను. వాళ్ళు నరభక్షణ చేసిన మాట నిజం. అయితే: వాళ్ళుచెప్పినదేమంటే—తాము నియమం తప్పలేదనీ, భూలోకంలో కులమతాల పేరు చెప్పి, దోపిడీ దొంగతనాల కారణంగానూ, మనిషే మనిషిని చంపుతున్నాడట. అలా చచ్చిన మనుషులనే, తాము తిన్నామని వాళ్ళు నాకు చెప్పారు. వాళ్ళ మాటల్లోని నిజానిజాలు పరీక్షించడం కోసం, నేను స్వయంగా భూలోకానికి వచ్చాను. వాళ్ళు చెప్పింది నిజమేనని



RED



తెలిసింది. అందుక్కారణమేమిటో తెలుసుకోవాలని, ఇక్కడే మరి కొద్ది రోజులున్నాను. అదిప్పుడు తెలిసింది!'' అన్నాడు రాక్షసుడు.

''ఏమిటా కారణం?'' అని అడిగాడు మాధవసేనుడు కుతూహలంగా.

''భూలోకంలోని రాజులందరిలోనూ, పూర్వకాలపు రాక్షసుల అంశ వున్నది. వాళ్ళు చాలా స్వార్థపరులు, క్రూరులు, అసమర్థులు, శక్తిహీనులు,'' అన్నాడు రాక్షసుడు.

రాక్షసుడి మాటలకు మాధవసేనుడికి చాలా కోపం వచ్చింది. ఆయన వెంటనే, ''నేను స్వార్థపరుణ్ణీ, క్రూరుణ్ణీ కాదని, యిప్పటికిప్పుడు రుజువు చేయలేను. కాని, అసమర్థుణ్ణీ. శక్తిహీనుణ్ణీ కాదని యిప్పుడే రుజువు చేయగలను. ఈ క్షణానే రాక్షస రూపం ధరించు! నిన్ను నేనోడించగలను,'' అన్నాడు.

''రాక్షసరూపంలో వున్న నన్ను ఓడించడం, ఏ మానవుడికీ సాధ్యం కాదు. నా శక్తి అపారం. ధైర్యముంటే, ముందు నన్నీ రూపంతోనే ఓడించు,'' అన్నాడు రాక్షసుడు.

అందుకు మాధవసేనుడు ఒప్పుకోక, ''నేనిప్పుడు మగధదేశపు రాజును. ఆ కారణంగా, ఏ మనిషి మీదా కత్తి దూయను. నా శక్తి నిరూపించుకోవడానికి, సాటిమనిషిని గాయపరచడమంటే బాధగా వుంటుంది. అందువల్ల, నేను నిజంగా నీతో యుద్ధం చేయాలంటే, అందుకు బలమైన కారణం వుండాలి,'' అన్నాడు.

''అయితే విను! మనిషి, మనిషిని చంపడంవల్ల, రాక్షసులకు నరభక్షణ చేసే అవకాశం మళ్ళీ వచ్చింది. ఆ అవకాశం పోకుండా వుండడం కోసం, నేను అప్పుడప్పుడూ భూలోకానికి వచ్చి, మనుషుల్ని రెచ్చకొట్టి పోతూంటాను. వాళ్ళలో వాళ్ళకు కలహాలు పెడుతూంటాను. నావంటివాడిని వదిలిపెట్టడం, నీకు ప్రమాదమే కదా? నన్ను యుద్ధంలో

ఓడిస్తే, నువ్వు చెప్పినట్టు వింటాను," అన్నాడు రాక్షసుడు.

"అయితే, నా ప్రతాపం చూడు!" అంటూ మాధవసేనుడు కత్తి దూశాడు.

రాక్షసుడు తనూ ఒరలోంచి కత్తి తీసి, మాధవసేనుడితో కలబడ్డాడు. కొద్ది క్షణాలలోనే రాక్షసుడి కత్తిఎగిరి దూరంగా పడింది.

ఆ తర్వాత మాధవసేనుడూ, రాక్షసుడూ మల్లయుద్ధం చేశారు. తనకంటే బలవంతుడైన రాక్షసుణ్ణి, మాధవసేనుడు ఏదో కిటుకుతో క్షణాల మీద గాల్లోకి ఎత్తి, గిరగిరా తిప్పి నేల కేసి కొట్టాడు.

రాక్షసుడి కళ్ళు బైర్లుకమ్మాయి. కొద్ది సేపు తర్వాత వాడు తమాయించుకుని లేచి నిలబడి, "నీ శక్తియుక్తులు అపూర్వం! నీకు, నేను తప్పక సాయపడతాను. నీకేం కావాలో చెప్పు!" అంటూ, అప్పటికప్పుడు భయంకర రాక్షసుడుగా మారిపోయాడు.

"నువ్వు, నాకు యుద్ధంలో సాయపడు. ఈ భూమండలానికంతకూ ఏకచ్ఛత్రాధిపతినై, శాంతిస్థాపన చేస్తాను!" అన్నాడు మాధవసేనుడు.

ఆ మాటలకు రాక్షసుడు వికటాట్టహాసం చేసి, "రాజా, నేనన్న మాట నిలబెట్టుకోలేనందుకు, మన్నించు. కాని, నా నుంచి సాయం పొందే అర్హత నీకు లేదు. నీలో శక్తి వుంది కాని, తెలివిలేదు!" అని, మాయమైపోయాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాక్షసరాజు అన్నమాట తప్పడానికి కారణం ఏమిటి? తన సాయంతో రాజు మాధవసేనుడు, రాజ్యాలన్నిటినీ జయించి శాంతిస్థాపన చేస్తే, రాక్షసులకు నరమాంసం తినే అవకాశం పోతుందనే కదా? పైగా, రాక్షసుడు అన్న మాట నిలబెట్టుకోకపోగా, మాధవసేనుణ్ణి, 'నీలో శక్తి వుంది కాని, తెలివిలే' దనడం తన బుద్ధిమాంద్యాన్ని చాటుకోవడమే గదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాక్షసరాజు బుద్ధిశాలి, చాలా ఉదారగుణం కలవాడు. తమకంటే బలహీనులైన మనుషులను, తనవారు చంపి తినకుండా ఎంతో కట్టుదిట్టం చేశాడు. కాని, అతడు భూలోకానికి వస్తే, అదమరిచి నిద్రపోవడానికి మనుష్య రూపం ప్రమాదకరమయింది. అంటే, మాధవసేనుడి రాజ్యంలో మనిషికి రక్షణ లేదు. ఆ బాధ్యత ఎవరిది? దేశాన్నేలే మాధవసేనుడిది. అందుకే, రాక్షసుడు ఆయన్ని అసమర్థుడన్నాడు. రాక్షసుణ్ణి ఓడించి. తన సమర్థత రుజువుపరచాలనుకున్నాడు, మాధవసేనుడు. అయితే, తన రాజ్యంలో అరాచకత్వాన్ని అదుపు చేయలేని రాజు, ప్రపంచాన్ని జయించి శాంతిస్థాపన చేయాలనుకుంటున్నాడు. యుద్ధమంటే, కొన్ని లక్షలమంది ప్రజలూ, సైనికులూ ప్రాణాలు కోల్పోతారు. అందువల్ల లాభపడేది రాక్షసులే! నిద్రపోతున్న పందికొక్కు ప్రాణాలు తీయడానికే, ఎంతగానో ఆలోచించి వ్యథచెందిన రాజు మాధవసేనుడు, యుద్ధం ప్రారంభించి లక్షలాది ప్రజల ప్రాణాలు తీయాలనుకుంటున్నాడు. అందుకే, రాక్షసుడు ఆయన తెలివిని పరిహాసం చేశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# జమీందారు పాట

రత్నపురం జమీందారు ధర్మరాజు కచేరీలో, చాలామంది గుమాస్తాలూ, పనివాళ్ళూ వున్నారు. కాని, అవసరపడినప్పుడు, ఆయనకు సలహాలిచ్చి, అప్పుడు చేసిన నిర్ణయాలను అమలుచేయగలవాళ్లు మాత్రం ఎవరూలేరు.

ఈ లోటును భర్తీ చేసేందుకు, జమీందారు ఒక తెలివిమంతుడైన సలహాదారును నియమించాలనుకున్నాడు.

ఈ సంగతి తెలిసి, ఆరుగురు యువకులు, ఆయనకు అర్జీలు పంపుకున్నారు.

జమీందారు రమ్మన్నరోజున, ఆయన వద్దకు ఆరుగురు యువకులూ వచ్చారు. జమీందారు వాళ్ళతో, "నాకు కవిత్వమన్నా, యితర లలితకళలన్నా ఎంతో ప్రీతి అని మీరెరిగే వుంటారు. ఎవరో రాసిన కవిత్వం చదివి ఆనందించడంతో పాటు, స్వయానా కవిత్వం రాయాలన్న కోర్కె, యీ మధ్యనే కలిగింది. ఈనాడు, ఎన్నో అపురూపమైన భావాలతో మనస్సు ఉద్రూతలూగిపోయింది. ఒక పాట రాస్తున్నాను, వినండి!" అని, ఒక ఆరు చరణాలు పాడి, వాళ్ళకు వినిపించాడు. యువకులు ఆ పాట విన్నారు.

అప్పుడు జమీందారు, "ఈ సమయంలో, యింకా ఏదో రాయాలన్న భావావేశం కలుగుతున్నది. అందుచేత, నా ఆలోచనలకు భంగం కలగకుండా, ప్రస్తుతానికి మీరు వెళ్ళి, తర్వాత, లక్ష్మీవారంనాడు రండి," అని చెప్పాడు.

యువకులు, జమీందారు దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళిపోయి, ఆయన రమ్మన్న లక్ష్మీవారంనాడు తిరిగివచ్చారు. జమీందారు, వాళ్ళను చూసి, "మీరు లోగడ వచ్చినప్పుడు, ఒక పాట వినిపించానుగదా! ఆ పాట రాసిన కాయితం కనబడకుండా

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

పోయింది. ఆ పాట, మీలో ఎవరికైనా జ్ఞాపకం వున్నదా ?'' అని అడిగాడు.

ఆరుగురు యువకులూ, ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. వాళ్ళలో రామకీర్తనం అనే యువకుడు, జమీందారుతో, ''అయ్యా, తమ పాట నాకు జ్ఞాపకం వున్నది, చిత్తగించండి!'' అని, ఆ పాట ఆరుచరణాలూ పాడి వినిపించాడు.

రామకీర్తనం జ్ఞాపకశక్తి చూసి, మిగిలిన ఐదుగురూ అద్భుతం చెందారు.

జమీందారు, అతణ్ణి మెచ్చుకుంటూ, ''రామకీర్తనం, నీ జ్ఞాపకశక్తి సాటిలేనిది. పాట రాసిన నాకే గుర్తులేని, ఆ ఆరు చరణాలనూ వినిపించావు!'' అన్నాడు.

అందుకు, రామకీర్తనం వినయంగా, ''అయ్యా, తమరు క్షమిస్తానంటే, ఒక చిన్న సంగతి చెప్పదలిచాను,'' అన్నాడు.

''ఏమిటది? అలాగే చెప్పు,'' అన్నాడు జమీందారు ఆశ్చర్యపోతూ.

''ఈ పాట, మీరు రాసింది కాదు,'' అన్నాడు రామకీర్తనం.

''నేను రాసింది కాదా? సరే, ఆ రాసిన కవి ఎవరో చెప్పు,'' అన్నాడు జమీందారు.

''ఈ పాట, మా నాయనమ్మ పాడగా విన్నాను. అప్పటికామెకు, దాదాపు ఎనభై ఏళ్ళవయసు. నేను నాలుగైదేళ్ళవాడిని,'' అన్నాడు రామకీర్తనం.

జమీందారు పెద్దగా నవ్వి, ''ఆహాఁ, నీ జ్ఞాపకశక్తి అమోఘం, రామకీర్తనం! నిజంగానే, ఆ పాట నేను రాసింది కాదు. మీలో మంచి జ్ఞాపకశక్తి గల వాళ్ళెవరో తెలుసుకునేందుకు, యీ పరీక్ష పెట్టాను. నాలుగైదేళ్ళ వయసులో విన్న పాట, యింతకాలం గుర్తుంచుకోవడం గొప్ప విశేషమే. నాకు సలహాదారుగా వుండే వాడికి, తెలివితేటలతోపాటు, మంచి జ్ఞాపకశక్తి కూడా అవసరం. ముఖస్తుతి కోసం, ఆ ఆరుచరణాలూ పాడి, గొప్ప కవిత్వం రాశారని అనకుండా, పాట నాది కాదని ఎంతో ధైర్యంగా, నిజాయితీతో చెప్పావు. నా కచేరీలో, నిన్ను సలహాదారుగా నియమిస్తున్నాను,'' అన్నాడు.



కావ్యకథలు:

# శకుంతల-1



కణ్వమహర్షి, ఒకనాడు తన ఆశ్రమానికి వస్తూ, దారిలో కొన్ని పక్షులు ఒక శిశువును కాపాడుతూ ఉండడం చూసి, ఆశ్చర్యపడ్డాడు. ఆయన ఎంతో ఆప్యాయంగా ఆ శిశువును, తన ఆశ్రమానికి తీసుకుపోయి, ఆమెకు శకుంతల అని నామకరణం చేసి, పెంచసాగాడు. మేనకా విశ్వామిత్రుల కుమార్తె అయిన శకుంతల కణ్వుడి ఆశ్రమంలోనే పెరిగి పెద్దదయింది.



హస్తినాపురాధీశుడయిన దుష్యంత మహారాజు, ఒకనాడు వేటాడడానికి అరణ్యానికి వెళ్ళి, దాపులనే కణ్వ ముని ఆశ్రమం ఉన్నదని తెలిసి, ఆయన దర్శనంకోసం, అంగరక్షకులను దూరంగా వదిలి పెట్టి, ఒంటరిగా అక్కడికి వెళ్ళాడు.

ఆ సమయంలో కణ్వముని ఆశ్రమంలో లేడు. శకుంతల తోటి మునికుమార్తెలతో ఆడుకుంటున్నది. ఒక తుమ్మెద చుట్టి చుట్టి వస్తూ, ఆమెకు ఇబ్బంది కలిగించ సాగింది. ఆ తుమ్మెదను తరుముతూ దానిని గురించి, తన స్నేహితురాలికి చెప్పింది శకుంతల. అప్పుడు ఆ ముని కుమార్తె, "మనం దానిని గురించి దుష్యంత మహారాజుకు ఫిర్యాదు చేయ గలమని ఆ తుమ్మెదకు తెలియదులా గున్నది!" అన్నది.





ఆ మాటలు వింటూ, దుష్యంతుడు వారిని సమీపించాడు. రాజును చూసి వారెంతగానో ఆశ్చర్యపడ్డారు. ఆశ్రమంలో మునీ లేడు కాబట్టి, రాజుకు వాళ్ళే తగిన అతిథి మర్యాదలు చేయ వలసి వచ్చింది.

రాజుకు వాళ్ళు భక్తి గౌరవాలతో ఫల పుష్పాలు సమర్పించారు. ఆశ్రమంలో ఆయన్ను విశ్రాంతి తీసుకోమన్నారు. శకుంతల అందచందాలకు, వినయ విధేయతలకు రాజు పరమానందం చెందాడు.





వన్యమృగాలు కొన్ని ఆశ్రమ ప్రాంతంలో అలజడి పుట్టిస్తున్నవని రాజుకు తెలియవచ్చింది. ఆయన, ఏనుగు గుంపులనూ, అడవిదున్నలనూ, ఆశ్రమ ప్రాంతాలనుంచి, అరణ్య మధ్యంలోకి తరుమగొట్టాడు. అలసిపోయి, ఆశ్రమానికి వచ్చిన రాజుకు శకుంతల శ్రద్ధగా పరిచర్యలు చేసింది.

కొన్నాళ్ళకు ఒకరిమీద ఒకరికి అనురాగం ఏర్పడింది. తనను పెంచిన తండ్రి ఆశ్రమంలో లేకపోవడంవల్ల, వివాహమాడుటకు శకుంతల తొలుత జంకినప్పటికీ, దుష్యంతుడు మరీ మరీ చెప్పడంతో, అంగీకరించింది. ఇరువురూ గాంధర్వవివాహం చేసుకున్నారు. ధర్మస్వరూపుడయిన దుష్యంతుడు శకుంతలను వివాహమాడడం గ్రహించిన మునికుమార్తెలు అమితానందం చెందారు.





దుష్యంతుడు రాజధానికి చేరి, రాచ కార్యాలు నిర్వర్తించవలసిన సమయం ఆసన్నమయింది. కణ్వముని వచ్చిన తరవాత, ఆయన ఆశీస్సులతో, శకుంతలను రాచనగరుకు రప్పించుకోగలనని చెప్పి, ఆమెకు తన వేలి ఉంగరాన్ని కానుకగా ఇచ్చి, రాజు రాజధానికి ప్రయాణమయ్యాడు.

దుష్యంతుడు ఆశ్రమవాసులందరివద్దా సెలవు తీసుకున్నాడు. శకుంతల హృదయభారంతో ఆయనకు వీడ్కోలు పలికింది. రాజు కూడా ఎంతో బాధతో శకుంతలను వదిలి హస్తినాపురం బయలుదేరాడు.





కొన్నాళ్ళకు, కణ్వముని ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. తను, దుష్యంతుణ్ణి వివాహమాడిన సంగతి తెలిసి, ఏమంటాడో అన్న భయంతో వణికిపోతూ, శకుంతల కణ్వముని పాదాలకు మొక్కరిల్లింది! —(ఇంకావుంది)



# మూడు సూత్రాలు

ఒక గురుకులంలో ఒక పేద విద్యార్థి ఉండేవాడు. గురువుగారు ఇతర విద్యార్థులతో బాటు అతనికీ చదువు చెప్పాడు. కాని, దురదృష్టవశాత్తూ పేద విద్యార్థికి చదువు అంటలేదు. శిష్యులందరూ చదువు పూర్తిచేసి వెళ్ళిపోయేటప్పుడు గురువుగారు పేదశిష్యుడితో, "నాయనా, నీతో బాటు నావద్ద చదివినవారందరూ పండితులయారు. నీ దురదృష్టమో, నా దురదృష్టమో, నీకు మాత్రం చదువు అబ్బలేదు. నీకు మూడు సూత్రాలు చెబుతాను. అదృష్టం ఉంటే, వాటి మూలాన నీవు బాగుపడవచ్చు." అని చెప్పి, మూడు సూత్రాలు చెప్పాడు. అవి ఏమంటే:

నడవగా నడవగా అదే వస్తుంది.

అడగగా అడగగా అదే తెలుస్తుంది.

మెలకువగా ఉంటే మరణ భయం ఉండదు.

గురువుగారు చెప్పిన ఈ మూడు సూత్రాలూ చెవిన వేసుకుని, శ్రద్ధగా మననం చేసుకుంటూ పేద విద్యార్థి ఇంటికి బయలుదేరాడు. దారిలో అతనికి వేదవతీనగరం చూడాలని కోరిక పుట్టింది. అందుచేత అతను ఇంటి దారి విడిచిపెట్టి, దారి అడిగి తెలుసుకుంటూ వేదవతీ నగరం దారి పట్టాడు.

ఆ నగరం ఎంత దూరం ఉన్నదీ శిష్యుడికి సరిగ్గా తెలియదు. అది చాలా దూరం ఉంది. బండి చేసుకుని వెళ్ళటానికి అతని వద్ద డబ్బు లేదు. అందుచేత పట్టుదలగా కాలినడకనే ప్రయాణం చేసి, పేద విద్యార్థి కొన్ని మాసాలకు వేదవతీనగరం చేరాడు. గురువుగారు చెప్పిన మొదటి సూత్రం, నడవగా నడవగా అదే వస్తుందన్నది, అతనిపట్ల నిజమయింది.



వేదవతీనగరం చాలా పెద్దది. దారి తప్పి అంతదూరం వచ్చినాక, అక్కడే ఒక చిన్న ఉద్యోగం సంపాదించుకుని కొంత కాలం ఉంటే తప్ప తాను పడిన శ్రమకు ఫలితం ఉండదని విద్యార్థికి తోచింది. ఆ ప్రకారమే అతను కొద్దిపాటి జీతం మీద ఒక ఉద్యోగం సంపాదించి, తనకు పనిలేని వేళలలో కనిపించిన వారినల్లా నగర విశేషాలు అడుగుతూ వచ్చాడు.

''అడగగా అడగగా అదే తెలుస్తుంది'' అన్న రెండో సూత్రం కూడా ఆ పేద విద్యార్థిపట్ల అక్షరాలా నిజమయింది. అనేక మందితో మాట్లాడిన మీదట శిష్యుడికి ఆ నగరం గురించి అతి ముఖ్యమైన విశేషం ఒకటి తెలిసి వచ్చింది. ఆ విశేషం ఏమిటంటే—

ఆ నగరాన్ని ఏలుతున్నది రాజు కాదు, రాణి. ఆమెకు అయిదారు వివాహాలు జరిగినా, ఇంకా కన్యగానే ఉన్నది. అది ఎలా జరిగిందంటే ఆమెను పెళ్ళాడిన ప్రతివాడూ పెళ్ళినాటి రాత్రి వింతగా చనిపోయాడు. ఇలా వరసగా అయిదారుగురు చనిపోయాక భయంకొద్దీ ఆమెను పెళ్ళాడటానికి ఏ రాజకుమారుడూ సాహసించలేదు.

చూసి చూసి, మంత్రులకు ప్రాణం విసిగి, తమ రాణీని ఎవరు పెళ్ళాడితే వారికి రాజ్యాభిషేకం చేస్తామని చాటింపు వేశారు.

ఆ చాటింపు విని కూడా మరణభయం కారణంగా, ఎవరూ రాణీని పెళ్ళాడటానికి సాహసించి ముందుకు రాలేదు.

పేద శిష్యుడీ మాట విని తన గురువుగారు చెప్పిన మూడో సూత్రం జ్ఞాపకం తెచ్చుకున్నాడు. మెలకువగా ఉంటే మరణ భయం ఉండదు! గురువుగారి మాటల్లో తనకు గల విశ్వాసం కొద్దీ పేద శిష్యుడు రాణీని పెళ్ళాడ నిశ్చయించుకున్నాడు.

అతను ఒకనాడు తిన్నగా రాజభవనానికి వెళ్ళి, మంత్రులతో తాను రాణీని పెళ్లాడ నిశ్చయించినట్టు చెప్పాడు. వాళ్లు పరమానందభరితులై, పెళ్ళి ముహూర్తం నిశ్చయించారు.

పెళ్ళినాడు పేద శిష్యుడికి రాజోచితమైన దుస్తులు కట్టబెట్టి ఘనంగా పెళ్ళి తంతు జరిపించారు.

ఆ రాత్రి అతను పడక గదికి వెళుతూనే తన దుస్తులు విప్పి ఒక పక్కన పెట్టి, తన కత్తి కూడా గోడకు చేరబెట్టి, పడక గది వెలపల అలంకారార్థం ఉంచిన అరటి బోదెలలో తలగొట్టి తెచ్చి తాను పడుకునే పక్క మీద ఉంచి, దానిపై దుప్పటి కప్పాడు. తరవాత అతను కత్తిదూసి చేత బట్టుకుని ఒక స్తంభం చాటున నక్కాడు. మరణ భయం గల వాడికి మెలకువ అవసరం గనక అతను నిద్రపోదలచలేదు.

కొద్దిసేపు గడిచింది. పైకప్పులో నుంచి ఒక తాచు పాము పెళ్ళికొడుకు మంచాన్ని ఆని ఉన్న స్తంభం మీదుగా చరచరా దిగి వచ్చి, పక్క మీద ఉన్న అరటి బోదెను చూసి, మనిషే అనుకుని దాన్ని కాటు వేసింది.

అదే క్షణంలో శిష్యుడు చాటు నుంచి ఒక్క గెంతున ముందుకు వచ్చి, ఆ పామును కత్తితో నరికేశాడు. పాము తల ఎగిరి దూరంగా పడింది. ఆ తరవాత అతను చచ్చిన పామునూ, అరటి బోదెనూ అవతల పారేసి నిశ్చింతగా నిద్రపోయాడు.

మర్నాడు మంత్రులు వచ్చి పెళ్ళికొడుకు ప్రాణాలతో ఉండటం చూసి అంతులేని ఆనందం పొందారు. ఆ రోజే వారు అతనికి ఘనంగా రాజ్యాభిషేకం జరిపారు.

చదువు అబ్బకపోయినా, గురువుగారి మాటలయందు భక్తి శ్రద్ధలుంచిన వాడు కావటం చేత పేదవిద్యార్థి వేదవతీ నగరానికి రాజై, చాలాకాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు.



# లంచం

శ్రీశృంగేరి దేశపు రాజుకు, శత్రువుల బెడద ఎక్కువైంది. శత్రు రాజుల నుంచి రాజధాని నగరాన్ని రక్షించుకునేందుకు, దానిచుట్టూ కొండరాళ్ళతో ఎత్తయిన గోడ కట్టించి, ముఖ ద్వారానికి ఇనుపతలుపులు పెట్టించాడు.

రాతిగోడ గట్టితనం, ఇనుపతలుపుల బలం పరీక్షించేందుకు, వాటిని ఏనుగులచేత కుమ్మించి, ఫిరంగిగుళ్ళతో కొట్టించాడు. ఏమీ చెక్కు చెదర లేదు.

రాజు పరమానందం చెంది, సైన్యాధిపతి, మంత్రులతో, "ఈ గోడా, ముఖద్వారం శత్రువులకు దుర్భేద్యం! నగరంలో వాళ్ళు కాలుమోపలేరు," అన్నాడు.

ఆ మాటలకు మంత్రి నవ్వి వూరుకున్నాడు.

ఇది జరిగాక, ఒకనాటి రాత్రి రాజూ, మంత్రీ మారువేషాల్లో నగర పరిసరాలు తిరిగి, నగర ముఖద్వారం దగ్గిరకు వచ్చి, అక్కడ కాపలావున్న భటుల నాయకుణ్ణి తలుపులు తెరవవలసిందిగా కోరారు.

అందుకు భటుల నాయకుడు, "సైన్యాధిపతి అనుమతి పత్రం లేనిదే, సూర్యాస్తమయం తర్వాత, ఎవరూ నగరంలో ప్రవేశించడానికి వీలులేదు," అన్నాడు.

మంత్రి, అతణ్ణి పక్కకు తీసుకుపోయి, అతడి చేతిలో ఇరవై బంగారు నాణాలు పెట్టి, "మాకు నగరంలో చాలా అవసరం అయిన పని వున్నది," అన్నాడు.

భటుల నాయకుడు, కాపలా భటులను తలుపులు తెరవవలసిందిగా ఆజ్ఞాపించాడు.

జరిగింది చూసి ఆశ్చర్యపడుతున్న రాజుతో, మంత్రి, "ప్రభూ! ఏనుగుల కన్న, ఫిరంగుల కన్న బలవత్తరమైన దేమిటో, తెలిసింది గదా!" అన్నాడు.

—కోలార్ కృష్ణ అయ్యర్





# కృష్ణావతారం

కుంభకుడి మందలో పుట్టిన రాకాసి కోడెలను గురించీ, అవి చేసే దురాగతాలను గురించీ, ప్రజలు మొరపెట్టుకోగా, మిథిల రాజు కుంభకుణ్ణి పిలిపించి, "నీ కోడెలు తమను బతకనివ్వటంలేదని పౌరులు ఆక్రోశిస్తున్నారు. నువ్వయినా ఘరానా మనిషివే గాని, సాదా మనిషివి కావు; నీకు బోలెడంత బలగమున్నది. పది మందినీ సహాయం పిలిచి, ఆ పోట్లగిత్తలను వెంటనే అదుపులో పెట్టెయ్యి, లేదా బీజాలు తీయించు, అలాగూ కాకపోతే అరణ్యంలోకి తరిమెయ్యి." అని గట్టిగా హెచ్చరించి పంపాడు.

కుంభకుడి కేమీ పాలుపోలేదు. ఆ పొగరుబోతు కోడెలను నిగ్రహించటం అతని తరం కాలేదు. అందుకు ప్రయత్నించినప్పుడు చాలామంది గాయపడ్డారు, కొందరు చచ్చారు కూడా. అందుచేత అతను, ఎంత ఆలోచించినా మరొక ఉపాయమేదీ తోచక, తన కోడెలను జయించినవాడికి తన కుమార్తె అయిన నీళ నిచ్చి పెళ్ళి చేస్తానని చాటింపు వేయించారు.

ఈ చాటింపు వింటూనే ఎక్కడెక్కడి నుంచో గోపయువకు లందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు. గోవుల మధ్య జీవించే వాళ్ళకు గొడ్లను వంచడం ఎంత పని అని వాళ్ళ ఉద్దేశం. అందుచేత తేలికగా మంచి భార్య దొరుకుతుందని వాళ్ళు ఆశపడ్డారు. •

6. నీళాకృష్ణుల వివాహం



అలా వచ్చినవాళ్ళు తలా ఒక విధం గానూ ప్రగల్భాలు పలికారు. ఒకడు కోడెలను కొమ్ములు పట్టి వంచేస్తానన్నాడు. ఇంకొకడు వాటిని పడదోసి పట్టి, ముక్కులు కుట్టుతానన్నాడు. ఇలా బీరాలు పలుకుతూ గోపకులు మల్లలు చరిచారు, అరిచారు, పరుగులు తీశారు, హంగామా చేశారు.

చాటింపు వేసిన సమయంలోనే కుంభకుడు నందగోపుడి వద్దకు మనుషులను పంపాడు. ఆ మనుషులు వచ్చి ఏడెద్దుల సంగతంతా చెప్పగానే నందుడూ, యశోదా, వాళ్ళవెంట బలరామకృష్ణులూ, మరికొందరు గోపకుమారులూ బయలుదేరారు.

కుంభకుడు తన అక్కకూ, బావకూ ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు. కుంభకుడి భార్య ధర్మద యశోదకు మర్యాదలు చేసింది. కుంభకుడి కొడుకు శ్రీధాముడు, కృష్ణ బలరాములను కౌగలించుకుని, వాళ్ళకు తానే పీటలు తెచ్చి వేశాడు. పాయసాలూ, నేతులూ పుష్కలంగా వడ్డించుకుని అందరూ భోజనాలు చేశారు.

ఆ రాత్రి రాకాసి ఎద్దులు, కృష్ణుడు వచ్చిన సంగతి గ్రహించి, విజృంభించాయి; చూడి ఆవులను కొమ్ములతో పొడిచాయి; ఆ తరవాత కుంభకుడి అంగణంలో చొరబడి, రంకెలు పెడుతూ, గిట్టలతో నేలను తవ్వుతూ అట్టహాసం చేసి, కుండలు పగలగొట్టి, గోడలు గీరి, గరిసెలు కూలదోసి, బళ్ళు విరగదన్ని, పందిళ్ళు పడదోసి, తలుపులు విరగదన్ని నానా బీభత్సమూ చేశాయి. ఆడవాళ్ళూ, పిల్లలూ హాహాకారాలు చేశారు. పైనుంచి వచ్చిన గోపకులు ఎక్కడ వీలుంటే అక్కడ దాక్కున్నారు.

తెల్లవారింది. కుంభకుడు గోపులనందరినీ పిలిపించాడు. తన కూతురిని అలంకరింపజేసి, తెచ్చి వారిముందు నిలబెట్టి, "గోపకుమారులారా, చూశారు గదా? ఈ పోట్ల గొడ్లు దిగ్గజాలలాటివి, సింహాలలాటివి. వీటిని అదుపులోకి తేవా

లని మేము చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయాయి. వీటిని అదుపులో పెట్టకపోతే నేమో రాజుగారు మమ్మల్ని దండిస్తారు. అందుచేతనే మహాబలులూ, అత్యంత సమర్థులూ అయిన మీ అందరినీ పిలిపించాను. మీలో ఎవరు ఈ పోట్లగొడ్లను శిక్షించినా, అతనికి ఈ పిల్ల నిచ్చి పెళ్ళి చేసేస్తాను,'' అన్నాడు.

గోపకుమారులంతా ఈ మాటలు విని పెద్ద సందిగ్ధంలో పడ్డారు. నీళను చూస్తే మనసులు ఉవ్విళ్ళూరుతూ ఉత్సాహం పొందుతున్నాయి. రాకాసి ఎడ్లను తలుచుకుంటే గుండెలు నీరై, కాళ్ళు చల్లబడుతున్నాయి. అందుచేత ఎవరూ ఒక నిశ్చయానికి రాలేని స్థితిలో చిక్కుపడ్డారు.

అప్పుడు నందుడి జ్ఞాతి అయిన ఘోషవంతుడనే గోపకుడు, ''ఈ బోడి ఎద్దులను చంపలేకపోతే నా బలపరాక్రమాలెందుకు? చూస్తూ ఉండండి, ఒక్క క్షణంలో వీటిని కూల్చిపారేస్తాను,'' అని మల్లచరిచి, పోట్ల ఎద్దులమీదికి వెళ్ళాడు. మిగిలిన వాళ్ళు దూర దూరంగా, చెట్లమీదా, పుట్టలమీదా, గట్లమీదా నిలబడి ఆశగా చూడసాగారు.

ఘోషవంతుడు ఒక ఎద్దు నెత్తిన పిడికిటితో బలంకొద్దీ కొట్టాడు. చూసే వాళ్ళంతా హర్షధ్వానాలు చేశారు. మరుక్షణమే ఏడు ఎద్దులూ అతన్ని చుట్టుముట్టాయి. కృష్ణుడు మాత్రం విచారంతో, ''ఇతనెందు కిలాటి పని పెట్టుకున్నాడు? ఎద్దులితన్ని ప్రాణాలతో వదులుతాయా?'' అనుకుంటున్నాడు. అంతలోనే ఎద్దులు అతన్ని తమ కొమ్ములతో పొడిచి ఎత్తి, నేలమీద విసిరికొట్టి, తమ కాలిగిట్టలతో దూరంగా తన్నేశాయి.

చూస్తున్న వాళ్ళంతా హాహాకారాలు చేశారు. ఈ విధంగా ఘోషవంతుణ్ణి నేలపాలు చేసిన ఎద్దులు మిగిలిన గోపక సమూహంపైనపడి, కొమ్ములతో పొడుస్తూ, గిట్టలతో మట్టగిస్తూ, నోళ్ళతో కొరుకుతూ, అందరినీ చెదరగొట్టి పారదోలసాగాయి.





అప్పుడు కృష్ణుడు బలరాముడితో, "ఇవి ఎద్దులు కావు. ఎద్దులకింత కసీ, ఇంత సాహసమూ ఉండటం అసంభవం. కుంభకుడికి నేనే సహాయం చేస్తాను," అన్నాడు. అని అతను ఆ పోట్లెద్దులను సమీపిస్తూ ఉంటే, నందుడూ, యశోదా కూడా "వద్దురా, బాబూ!" అని కేకలు పెట్టారు.

కృష్ణుడు మహాకోపంతో పిడికిలి బిగబట్టి వస్తుంటే, అన్నదమ్ములైన ఆ ఏడు రాకసి ఎద్దులూ, పాత పగకొద్దీ కోపావేశం చెంది, ఒక్కసారిగా అతనిపైకి దూకుతూ వచ్చాయి. అతను అందిన ఎద్దులను అరిచేతులతో ముఖాల మీద కొట్టి, కొమ్ములు పట్టుకుని ఒక ఎద్దును మరొక ఎద్దుమీదికి తోసి, కొన్నిటిని తోకలు పట్టి గిరగిరా తిప్పి, కొన్నిటి ముట్టెలూ, వీపులూ వాయగొట్టి, చూసే వారందరికీ మహాశ్చర్యం కలిగేలాగా పోరాడాడు. ఇదంతా అతనికి ఆట— చూసేవాళ్ళ వినోదంకోసం ఆడిన ఆట. చూసేవాళ్ళలో నీళ కూడా ఉన్నది. ఆమె ఎంతో ప్రేమతోనూ, సిగ్గుతోనూ తన కేసి చూస్తుంటే కృష్ణుడికి చాలా ఆనందం కలిగింది.

చిట్టచివర కతను ఈ ఆట కట్టిపెట్టి ఒక్కొక్క పిడికిటి పోటుతో ఒక్కొక్క ఎద్దును తల పగలగొట్టి, ముక్కులా నోటా నెత్తురు కక్కించి, కాలనేమి కొడుకు లేడుగురినీ కడతేర్చేశాడు. నందుడూ యశోదా పరిగెత్తుకుంటూ వచ్చి కృష్ణుణ్ణి కౌగలించుకున్నారు. కుంభకుడు నీళను చెయ్యిపట్టి కృష్ణుడి దగ్గిరికి తీసుకొచ్చి, అతని చేతిలో ఆమె చెయ్యి పెడుతూ, "ఇదుగో, నీ పరాక్రమానికి కానుక. నీ మరదలు నీ సొత్తే అయింది. ఏలుకో," అన్నాడు.

ఆయన కృష్ణుడికి వస్త్రాభరణాలూ, యశోదా నందగోపులకు బట్టలూ, మిగిలిన గోపకుమారులకు ఇతర కానుకలూ ఇచ్చి, నందుడితో, "బావా, నీ కొడుకు ఉద్దండ



ప్రచండ శూరుడు. అతడి దయవల్ల మాకు భయంకరమైన ఆపద తొలగిపోయింది. నా పరువు దక్కింది. ఇక మేము హాయిగా బతుకుతాం. నీళకు వేలకు వేలు గోవులను అరణంగా ఇస్తాను. నా సంతోషం కొద్దీ ఇచ్చే వీటిని నిరాకరించకు,'' అన్నాడు.

''పిచ్చివాడా, నాకు కట్టుకుపోయినన్ని గోవులున్నాయి. కృష్ణుడు పుట్టాక మా మందలు తెగ వృద్ధి చెంది, అంతులేని పాలు ఇస్తున్నాయి. ఆ పాలనుంచి ఎత్తుకు ఎత్తు నెయ్యి అవుతున్నది. అందరమూ సుఖంగా ఉంటున్నాం,'' అన్నాడు నందుడు.

ఆ రోజు మహోత్సవంగా గడిపి నంద యశోదలూ, నీళనూ, తోడుగా శ్రీధామున్నీ వెంటబెట్టుకుని కృష్ణుడూ, మిగిలినవాళ్ళూ తమ బృందావనానికి బయలుదేరి వెళ్ళిపోయి, సుఖంగా జీవించసాగారు. నూత్న యౌవనంలో ప్రవేశించిన కృష్ణుడు పసుపుపచ్చని పట్టుబట్ట కట్టి, నెమలి కన్నులు గల తలపాగా ధరించి, అడవి పువ్వుల మాలలు మెడలో వేసుకుని, వేణుగానంలో ఓలలాడుతూ అంతటా తిరుగుతున్నాడు.

ఒకనాడు బలరామకృష్ణులు పశువులను మేపటానికి యమునా తీరాన గల ఒక మహా వటవృక్షం వద్దకు వెళ్ళి, చుట్టూ గోవులు మేస్తూంటే వాటిని చూస్తూ ఆ మర్రిచెట్టు కింద కూర్చున్నారు. మిగిలిన గోపబాలకులు కాస్త దూరంలో ఆటలాడుకుంటున్నారు.

ఆ సమయానికి వామదేవుడూ, భరద్వాజుడూ అనే మహామునులు తీర్థయాత్రకై అటుగా వచ్చి, బ్రహ్మాండమైన మర్రిచెట్టును చూడగానే దానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, అక్కడ ఉన్న గోపకులతో, ''అబ్బాయిలూ, పాములూ, మొసళ్ళూ లేకుండా స్నానం చెయ్యడానికి అనువైన రేవు, యీ ప్రాంతాల ఎక్కడ ఉన్నది?'' అని అడిగారు.



గోపకులు ఒకళ్ళముఖాలు ఒకరు చూసుకుంటూ, "నాకు తెలీదు, వాణ్ణి అడగండి," అని ఒకరినొకరు చూపు కున్నారు. అల్లరి వెధవలు అకతాయితనం చేస్తున్నారని కృష్ణుడు లేచి మునీశ్వరులను సమీపించి, వినయంగా, "మహామును లారా, వీళ్ళకు మంచి రేవేదో ఏం తెలుస్తుంది? మీకు దివ్యమైన రేవు నేను చూపిస్తాను. మీ కాలకృత్యాలూ, అనుష్ఠా నాలూ పూర్తికాగానే తిరిగి ఇక్కడికి రండి. చిక్కాలలో మీగడ పెరుగుతో కలిపిన చద్ది ఉన్నది. చక్కెర కలిపిన పాయసం బోలెడంత తెచ్చాం. మీరు హాయిగా ఆరగించవచ్చు. లేదా, అప్పటి కప్పుడు ఉష్ణధారలు పిండి మీకు తాగ టానికి ఇస్తాం. నేను నందుడి కొడుకును, నా పేరు కృష్ణుడు. ఇతను మా అన్న బలరాముడు," అన్నాడు.

ఆ మునీశ్వరులు తమతో మాట్లాడిన ఆ కుర్రవాడి తేజస్సు చూసి, గోపకులంలో ఇలాటివాడు ఎలా కలిగాడా అని ఆశ్చర్య పడి, క్షణంపాటు కళ్ళు మూసుకుని, సమాధిశక్తి ద్వారా నిజం తెలుసుకున్నారు. వాళ్ళు కృష్ణుడితో, "మా అదృష్టం నాయనా! బ్రహ్మదేవుడు మొదలైనవాళ్ళు విశ్వప్రయత్నం చేసినా కనబడని నిన్ను మేము ఇవాళ ఇక్కడ చూడగలిగాం! మా జన్మ సార్థకమయింది. నిన్ను కొడుకునుగా కన్న ఆ తల్లిదండ్రులు అదృష్టవంతులు," అంటూ కృష్ణుణ్ణి పొగడి తమ దారిన తాము వెళ్ళిపోయారు.

మళ్ళీ కృష్ణుడికి జీవితం మామూలుగా గడిచిపోతున్నది. అతను బలరాముడితో సహా గోపబాలకుల వెంట అవుల మంద లతో బాటు మేత ప్రదేశాలన్నీ తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ హాయిగా ఉంటు న్నాడు.

ఒకనాడతను యమున వెంబడి చాలా దూరం వెళ్ళి అందులో ఒక భయంకర మైన మడుగొకటి చూశాడు. అది చాలా పెద్దది. అందులో సముద్రపు నీరు తెర్లినట్టు

నీరు తెర్లుతున్నది. దానిపైన దట్టంగా ఆవిరి కప్పి ఉన్నది. దాని సమీపంలో ఉన్న తీరాల వెంబడి గల చెట్లూ, లతలూ మాడి ఉన్నాయి. దానినుంచి బయలు దేరే అలలు భయంకరంగా ఒడ్లను కొట్టు కుంటున్నాయి. ఆ ప్రాంతాల ఒక పిట్ట గాని, ప్రాణిగాని బతికేటట్టు లేదు.

ఆ మడుగులో కాళియుడనే మహా సర్పం ఉంటున్నదనీ, దాని నోట అగ్ని జ్వాలలు వెలువడుతూంటాయనీ, ఆ కాళియుడికి గరుత్మంతుడి భయం లేదనీ కృష్ణుడు అదివరకే విని ఉన్నాడు. ఇప్పుడీ మడుగు చూస్తూంటే ఆ మాట నిజమే అయి ఉంటుందనిపించింది. అతను ఆ మడుగులోకి ప్రవేశించి, ఆ మహాసర్పం మదమణగించి, మడుగును పశువులు దిగటానికివీలుగా చెయ్యాలనినిశ్చయించు కున్నాడు. అందువల్ల మరొక మేలు కూడా ఉన్నది. అదేమిటంటే, ఈ కాళియుడి పరివారానికి చెందిన పాములు అసంఖ్యా కంగా వనమంతటా సంచరిస్తూ, బృందా వనంలోని కొన్ని ప్రాంతాలను అపాయ కరంగా చేస్తున్నాయి; కాళియుణ్ణి తగిన విధంగా మర్దించినట్టయితే పరిసర ప్రాంతా లలో ఈ చిల్లరసర్పాల ఆటకట్టవుతుంది. ఇది ఎలాగూ చేసి తీరవలసిన పని అలా టప్పుడు జాప్యం దేనికి? వెంటనే చేస్తే సరిపోతుంది.

ఇలా అనుకుని కృష్ణుడు మడుగు ఒడ్డును సమీపించాడు. నీటి అంచున, నిలువునా మాడిపోయిన కదంబవృక్షం ఒకటి ఉన్నది. కృష్ణుడు దానిపైకి ఎక్కి, మడుగులోకి దూక నిశ్చయించాడు. అతను ఎవరితోనూ సంప్రతించలేదు. చంకలో ఉన్న పలుపుతాళ్ళు అవతల పడవేశాడు. తన ఢక్కా, వేణువూ మరొకరి కిచ్చాడు. నెత్తిమీది పింఛం తీసేసి, జుట్టు ముడి వేసుకున్నాడు. బట్ట వెనక్కు విరిచి కట్టాడు. చెప్పులు వదిలేసి కదంబవృక్షం మీది కెక్కి, హాలోమని పెద్ద కేకపెట్టి మడుగులోకి దూకేశాడు. అతను పడ్డ చోట నది నీరు ఇంతెత్తున పైకి చిమ్మింది.





# నక్క చేసిన మేలు

పూర్వం చీనాదేశంలోని ఒక ప్రాంతంలో అంటాక్ అనే నిరుపేద ఒకడుండేవాడు. అతనికున్న ఆస్తి ఒక్క దానిమ్మచెట్టు మాత్రమే. దానికి పోషణ చేసి కాపాడుకోవటంలోనే అతని కాలమంతా గడిచిపోయేది. ముఖ్యంగా దానిమ్మకాయలు పండే తరుణంలో అంటాక్ చెట్టు దగ్గిరే కూచుని అహోరాత్రాలు కాపలా కాసేవాడు.

అల్లరి పిల్లలెవరేనా తన దొడ్డిగోడ మీదుగా తొంగి చూస్తేచాలు. అంటాక్ అగ్గి అయిపోయి వాళ్ళను నానాతిట్లూ తిట్టి, చిక్కితే కొట్టను కూడా కొట్టేవాడు.

తన దానిమ్మచెట్టు మీద అతను చూపే అధికారం చూసి అతనికి "దానిమ్మ రాజు" అని అందరూ పేరు పెట్టారు.

ఒక ఏడు దానిమ్మచెట్టుకు బాగా కాయలు కాశాయి. అవి పక్వానికి వచ్చే తరుణంలో అంటాక్ రాత్రింబగళ్ళు చెట్టు దగ్గిరే గడుపుతూ వచ్చాడు. ఒక రాత్రి ఎంత ఆపుకున్నా ఆగకుండా అతనికి నిద్ర వచ్చేసింది. తిరిగి మెలకువ వచ్చి చూసేసరికి చెట్టు మీద కొన్ని పళ్ళు లేవు.

అదే విధంగా మరుసటి రాత్రి మరి కొన్ని పళ్ళు మాయమయాయి.

మూడోనాడు దొంగను పట్టటానికిగాను అంటాక్ నిద్రపోతున్నట్టు నటించి, తన గోడ మీదుగా దూకి ఒక నక్క దానిమ్మ చెట్టు కేసి రావటం చూశాడు. నక్క చెట్టు పైకి ఎగబాకే సమయంలో అంటాక్ వెళ్ళి దాని తోకకాస్తా పట్టుకున్నాడు. కాని నక్క తప్పించుకు పోనేపోయింధి.

ఆ తరవాతరోజు అంటాక్ నక్కను పట్టటానికి ఒక యుక్తి పన్నాడు—అది గోడ మీది నుంచి దూకే చోట దట్టంగా బంక పోశాడు. నక్క అందులో దూకి

చీనా జానపద కథ



నక్క నేరుగా ఏటి అవతల ఉండే రాజుగారి ఇంటికి వెళ్ళి రాజుతో, "మహా రాజా, మీవద్ద రత్నాలు జల్లించే జల్లెడ లున్నాయట! మా రాజుగారు ఒకసారి తెమ్మన్నారు. చాలా తట్టలతో రత్నాలు వచ్చాయి. వాటిని జల్లించి నలిరత్నాలు పారేసి మంచివి ఉంచుకుంటారు," అన్నది.

రాజు సరేనని నక్కకు రత్నాలజల్లెడ ఇప్పించాడు. నక్క దాన్ని తీసుకుపోయి, దాని కంతలో అక్కడక్కడా సన్నని పచ్చలూ, వైడూర్యాలూ, కెంపులూ ఇరికించి జల్లెడను తీసుకుపోయి రాజు గారి కిస్తూ యాదాలాపంగా దానిని నేలకేసి కొట్టింది. రంగురంగుల రత్నపు నలుసులు కింద పడటం చూసి రాజకుమార్తెలు వాటిని ఏరుకోపటానికి ఎగబడ్డారు.

"రత్నాలు కావాలంటే చెప్పక పోయారా? మా అంటాక్ రాజుగారి నడిగి నాలుగు ఒంటెల మీద పట్టించుకు వచ్చి ఉందునే!" అన్నది నక్క.

ఈ అంటాక్ రాజును తన అల్లుడుగా చేసుకోవాలని రాజుకు దురాశ పుట్టింది. ఆయన నక్కతో, "రత్నాలమాటకేం గాని, నువు మధ్యవర్తిగా ఉండి మీ రాజుగారు మా ముగ్గురు అమ్మాయిలలో ఎవరినన్నా చేసుకునేటట్టు చేద్దూ!" అన్నాడు.

కదలలేక అతనికి చిక్కిపోయింది. అంటాక్ దానిని సమీపించి చేతులో వున్న దుడ్డుకర్రతో బాదబోయాడు.

"నన్ను వదిలిపెట్టావంటే నీకు గొప్ప మేలు చేస్తాను. కావాలంటే రాజు కూతురినే తెచ్చి పెళ్ళి చేస్తాను!" అన్నది నక్క.

"నన్ను చూస్తే నీకూ వేళాకోళంగానే ఉందా? పుట్టుదరిద్రుడికి, రాజుగారు కాదుగదా, ఎవరూ పిల్లనివ్వరు!" అన్నాడు అంటాక్. కాని నక్క, రాజ కుమార్తెను తెచ్చి పెళ్ళి చేసి తీరుతానని మరీమరీ చెప్పినమీదట అంటాక్ దానిని విడిచిపెట్టాడు.

"తొందరపడకండి. ఆయన కసలు పెళ్ళి ఆలోచన ఉన్నదీ లేనిదీ కూడా నాకు తెలీదు. విచారించి వచ్చి చెబుతాను!" అన్నది నక్క.

అది అంటాక్ వద్దకు తిరిగివచ్చి, "నీ పంట పండింది. రాజుగారు నీకు పిల్ల నిస్తారట. పెళ్ళికి బయలుదేరు!" అన్నది.

అంటాక్ దిగులుముఖం పెట్టి, "పెళ్లికి పోవాలంటే ఎంత డబ్బు చేతపట్టుకోవాలి, ఎంత సన్నాహం చెయ్యాలి! నా దగ్గిర చిల్లిగవ్వలేదే!" అన్నాడు.

"ఉపాయం ఉంటే అన్నిచెయ్యవచ్చు. నువ్వు కట్టుబట్టలతో కదులు. మిగతాది నేను చూస్తాను!" అన్నది నక్క.

ఇద్దరూ బయలుదేరి ఏటివద్దకు వచ్చారు. అంటాక్‌ను మెడలోతు నీటిలో నిలిచి ఉండమని చెప్పి నక్క ఏరుదాటి, నేరుగా రాజువద్దకు వెళ్ళింది.

"మహారాజా, మా రాజుగారు నలభై ఒంటెలపైన నవరత్నాలరాసులు ఎక్కించి పెళ్ళికి తరలి వస్తుండగా ఏరు పొంగి ఒంటెలన్నీ కొట్టుకుపోయాయి. పరివారమంతా ఏటిపాలయారు. మా రాజుగారి బట్టలన్నీ ప్రవాహంలో కొట్టుకుపోయాయి. ఏం చెయ్యాలో నాకు పాలుపోవటం లేదు!" అన్నది నక్క రాజుగారితో.



"పోయినదాని కేం చేస్తాం?" అంటూ రాజుగారు తన కాబోయే అల్లుడికి మంచి దుస్తులూ అవీ తీసుకుని, తన పరివారంతో ఏటివద్దకు వచ్చాడు.

అంటాక్ తన కాబోయే మామగారిచ్చిన రాజోచితమైన దుస్తులు ధరించి ఆయన వెంట వెళ్ళాడు.

అంటాక్‌కూ రాజుగారి ముద్దో కుమార్తెకూ వైభవంగా పెళ్ళి జరిగింది. విందులూ వినోదాలూ ముగిసినాక అంటాక్‌కు పెద్ద బెంగ పట్టుకున్నది. అతను నక్కతో, "ఇంతవరకు బాగానే జరిగింది. కాని నేను నా భార్యను కాపరానికి తీసుకుపోగానే నిజం బయటపడి



పోతుందే! ఏం జేతును!" అన్నాడు దిగులుగా.

"అప్పటి మాట అప్పుడు చూసు కుందాం!" అన్నది నక్క.

కొన్ని దినాలు గడిచాక రాజుగారు మంచి ముహూర్తం చూసి అల్లుడి వెంట తన కుమార్తెను సిబ్బందితోసహా కాపరానికి పంపాడు. నక్క ముందుగా పరిగెత్తి వెళ్ళింది. దారిలో దానికొక ఒంటెల బిడారు ఎదురైంది.

నక్క బిడారు యజమానితో, "బంది పోటు తరుముకువస్తున్నది! నువు బయలు దేరిన వేళ మంచిది కాదు. నీ సొత్తంతా వాళ్ళు దోచుకుపోతారు!" అన్నది.

బిడారు యజమాని నక్క వచ్చిన దిక్కుగా చూశాడు. గాలిలో దుమ్ము లేస్తూ ఉండటం అతనికి కనిపించింది. అతను కంగారుపడి, "ఏం చెయ్యను? నా ప్రాణం ఎట్లాగైనా కాపాడు!" అన్నాడు నక్కతో.

"వాళ్ళు వచ్చి ఈ బిడారు ఎవరిదని అడిగితే అంటాక్ మహారాజుదని చెప్పు. వాళ్ళు నిన్నేమీ చేయక తమ దారిన పోతారు!" అన్నది నక్క.

నక్క ముందుకు వెళ్ళిపోయింది. కొద్ది సేపట్లో రాజుగారి సిబ్బంది అటుగా వచ్చింది. రాజకుమార్తె వెంట ఉన్నవాళ్లు బిడారు యజమానిని, "ఈ బిడారు ఎవరిది?" అని అడిగారు.

ఆ మనిషి, "అంటాక్ మహారాజు గారిది!" అన్నాడు. రాజకుమార్తె వెంట ఉన్నవాళ్ళు సంతోషించారు.

నక్క దారిలో కనిపించిన ఒక గుర్రాల మంద యజమానికీ, ఒక గొర్రెలమందను కాసేవాడికీ కూడా ఇలాగే చెప్పింది. రాజకుమార్తె మనుషులు, "ఈ గుర్రాల మంద ఎవరిది?" "ఈ గొర్రెల మంద ఎవరిది?" అని అడిగితే ఆ మందలవెంట ఉన్న మనుషులు, "అంటాక్ మహారాజు గారిది!" అని జవాబు చెప్పారు. వాళ్ళు సంతోషించారు.

చివరకు నక్క ఒక రాక్షసుడి కోటకేసి వెళ్ళింది. రాక్షసరాజు నక్కను చూసి, ''ఏమిటి, అల్లావగర్చుతూ వస్తున్నావు?'' అని అడిగాడు.

''ఇంకేముంది? కొంప మునిగింది! బందిపోటు వచ్చి పడుతున్నది. నేనేమిటి, అందరూ పారిపోతున్నారు. బతికుంటే బలుసాకు తినవచ్చు. లక్షల సంఖ్యలో ఉన్నారు. నువు వాళ్ళను ఏం చెయ్యగలవు? ప్రాణం కాపాడుకో!'' అన్నది నక్క.

రాక్షసరాజు కంగారుపడి, ''ఎట్లా కాపాడుకోను? ఇప్పుడు ఎక్కడికి పోను!" అన్నాడు.

''గాడిపొయ్యిలో పడుకో! మీద కట్టెలు కప్పేస్తాను! వాళ్ళు వెళ్ళాక పైకి వద్దువుగాని!'' అన్నది నక్క.

రాక్షసరాజు గాడిపొయ్యిలో పడుకున్నాడు. వాడిపైన కట్టెలు పేర్చి నక్క వాటికి నిప్పు పెట్టింది. రాక్షసరాజు చచ్చిపోయాడు. నక్క పెళ్ళివారి సిబ్బందికి ఎదురు వెళ్ళి, దారి చూపి రాక్షసరాజు కోటకు వారిని తెచ్చింది.

ఆ కోట చూసి, అదే అంటాక్ రాజు కోట అనుకుని పెళ్ళికూతురూ, ఆమె వెంట వచ్చిన పరివారమూ చాలా సంతోషించారు. అంటాక్ తన భార్యతోనూ, ఆమె వెంట వచ్చిన పరివారంతోనూ సుఖంగా జీవిస్తూ వచ్చాడు. నక్క కూడా వారి వెంటనే ఉండేది.

ఒకనాడు నక్క అంటాక్ వద్దకు వచ్చి, ''నేను నీకింత ఉపకారం చేశాను. నేను చచ్చిపోతే నన్నేం చేస్తావు?'' అని అడిగింది.

''నెత్తిన పెట్టుకుంటాను!'' అన్నాడు అంటాక్.

కొంతకాలానికి నక్క చచ్చిపోయింది. అంటాక్ మాట ఇచ్చిన ప్రకారం నక్క చర్మంతో టోపీ చేయించి దానిని నెత్తిన పెట్టుకున్నాడు. ఈ ఆచారం ఇప్పటికీ ఆ ప్రాంతంలో ఉన్నది. వాళ్ళు నక్క చర్మాలతో చేసిన టోపీలు పెట్టుకుంటారు.






# రాజసత్కారం

ఒకనాడు రామశాస్త్రి అనే కవి, సరుకులు కొనేందుకు, కిరాణాకొట్టుకు వెళ్ళాడు. ఆ సమయంలో, కొట్టు యజమాని భూపతి, పక్కన వున్న మరొకడితో, సందర్భోచితంగా చెపుతున్న నీతివాక్యాలు రామశాస్త్రి విన్నాడు. అవి అతడి కెంతో ఆనందం కలిగించాయి.

ఆ రాత్రి రామశాస్త్రి దీక్షతో కూర్చుని, భూపతి నీతివాక్యాల ఆధారంగా కొన్ని పద్యాలు రాసి, తెల్లవారిన తర్వాత, ఆ ఊరి జమీందారు దగ్గిరకు పోయి వాటిని వినిపించాడు.

జమీందారు, రామశాస్త్రిని ఎంతగానో మెచ్చుకుని, బహుమానంగా యాభై బంగారుకాసులు, ఒక సంచిలో వేసి, ఆయన కిచ్చాడు.

రామశాస్త్రి, ఆ బహుమానంతో సరాసరి భూపతి కిరాణాదుకాణానికి వెళ్ళి, "చూడు, భూపతీ! నా పాండిత్యం గుర్తించిన జమీందారు, నా కిచ్చిన బహుమానం," అంటూ డబ్బు సంచిని భూపతికి చూపించాడు.

"అలాగా!" అంటూ భూపతి ఆశ్చర్యపోయాడు.

రామశాస్త్రి చిరునవ్వునవ్వి, "నీ నీతివాక్యాలే, నే రాసిన పద్యాలకు జీవం!" అన్నాడు.

రామశాస్త్రి మెచ్చుకోలు మాటలకు పొంగిపోయిన భూపతి, ఆయన్ని కూర్చోమని, "శాస్త్రిగారూ, మీరు ఓపిగ్గా రాయాలే కాని, నేనెన్నో అద్భుత విషయాలు చెప్పగలను," అన్నాడు ధీమాగా.

ఆనాటి నుంచీ పని వున్నా లేకపోయినా, రామశాస్త్రి, భూపతి కొట్టువద్దకు పోయి, రోజూ కొంతసేపు కూర్చుని మాట్లాడి వెళ్ళుతూండేవాడు.

కె. కె. రావు

ఒకనాడు భూపతి, పక్షులూ—వాటి మూగభాషపై, రామశాస్త్రికి ఎన్నో ఆసక్తికరమైన విషయాలు చెప్పాడు. రామశాస్త్రి వాటి సారాంశం తీసుకుని, మరి కొన్ని పద్యాలు రాసి, పక్క ఊరి జమీందారుకు వినిపించాడు. ఆయన చాలా సంతోషించి, రామశాస్త్రికి నూరు బంగారుకాసులు బహుమతిగా యిచ్చాడు.

ఈ సంగతి విన్న భూపతి, నాలో నివురుగప్పిన నిప్పులా, యింత ప్రతిభ వున్నదన్న మాట—అనుకుని చాలా గర్వపడ్డాడు. అయితే, రామశాస్త్రి మాత్రం, అతడు కోకొల్లలుగా చెప్పే విషయాల నుంచి, తనకు నచ్చిన కొద్దిపాటి తీసుకుని, మిగతాది గాలికి వదిలేస్తూండేవాడు.

ఒక రోజున భూపతి, ఆ దేశపు పరిపాలనా విధానం గురించి, చాలాసేపు మట్లాడాడు. రామశాస్త్రి దాని సారాంశం తీసుకుని, ఎంతో శ్రమించి కొన్ని పద్యాలు రాశాడు. అవి ఆణిముత్యాల్లా తయారయాయి.

రాజధానికి వెళ్ళి, ఆ పద్యాలను రాజుకు వినిపించాలన్న కోర్కె కలిగింది. రామశాస్త్రికి ఆయన మర్నాడే బయలుదేరిపోయి, రాజును దర్శించి, ఆయనకు తను రాసిన పద్యాలు వినిపించాడు. రాజు వాటిని ఒకటికి, రెండుసార్లు చదివించుకు విని చాలా ఆనందించాడు.

ఆయన రామశాస్త్రితో, ''నాలుగు రోజుల పాటు, మా అతిథి గృహంలో వుండండి.



తర్వాత మీకు నిండుసభలో సత్కారం చేస్తాను,'' అన్నాడు.

ఈ సత్కారం వార్త గ్రామం చేరగానే, భూపతి హడావిడిగా ప్రయాణం కట్టి, రాజధానికి వెళ్ళాడు.

ఐదవనాడు రాజు నిండుసభలో, రామశాస్త్రిని రాజు పద్యాలు చదవవలసిందిగా కోరాడు. రామశాస్త్రి అలాగే చేశాడు. సభలో వున్నవాళ్ళందరూ హర్షధ్వానాలు చేశారు.

రాజు, రామశాస్త్రి పాండిత్యాన్ని గొప్పగా పొగిడి, ఆయన మెడలో పెద్ద పూలమాల వేసి, వెయ్యి బంగారు కాసులు బహూకరించాడు.

సభలో వుండి, యిదంతా చూస్తున్న భూపతికి, రామశాస్త్రిపై ఎక్కడలేని ఈర్ష్య కలిగింది.

అతడు సభికుల మధ్య లేచి నిలబడి, ''మహారాజా, రామశాస్త్రిగారికి జరిగిన, యీ ఘనసత్కారంలో సగంవాటా, నాకు రావలసి వున్నది. ఆయన మా ఊరి వాడే!'' అని జరిగినదంతా వివరంగా చెప్పాడు.

అంతా విన్న రాజు మందహాసం చేసి, భటుడి చేత ఒక చెరుకుగడ తెప్పించి, దాన్ని భూపతి కివ్వమని ఆజ్ఞాపించి, ''ఆ చెరుకుగడలోంచి ఎంత బెల్లం వస్తుందో ఇప్పుడు నువ్వు సరిగ్గా చెప్పగలవా?'' అని ప్రశ్నించాడు.

''మహారాజా, యీ ప్రశ్నకు జవాబు నేనేకాదు, ఎవ్వరూ చెప్పలేరు. ఈ చెరుకుగడను గానుగలో వేసి తిప్పిన తర్వాతే, ఎంత బెల్లం వచ్చేదీ తెలుస్తుంది,'' అన్నాడు.

అప్పుడు రాజు, ''చూశావా, యీ రామశాస్త్రిగారికి, నువ్వు చెప్పిన విషయాలన్నీ, యీ చెరుకుగడ లాంటివే! ఆయన తన పాండిత్యంతో వాటికి కావ్యలక్షణాలు కల్పించాడు,'' అన్నాడు.

భూపతి తన తప్పు తెలుసుకుని రాజుకూ, రామశాస్త్రికీ నమస్కరించి, సభ నుంచి బయటికి వెళ్ళాడు.



# తప్పినగండం

నీలయ్య అనేవాడు, రాజుగారి భవనంలో గుడ్డలుతుకుతుండేవాడు. వాడికి రాత్రివేళల్లో రకరకాల వేషాలు ధరించి, నగర సంచారం చేయడం సరదా. ఒకనాడు వాడూ, మారు వేషంలో వున్న రాజూ, ఒక వీధిలో ఎదురు పడ్డారు.

మునివేషంలో వున్న రాజును చూసి, నీలయ్య, "ఎక్కడికిపోతున్నావు, యీ అర్ధరాత్రి వేళ?" అని గంభీరంగా ప్రశ్నించాడు.

"సత్రానికి, నాయనా!" అన్నాడు రాజు.

"సత్రానికా? దొంగతనానికా? నీలాంటి వేషాల్లో వున్నవాళ్ళు, దొంగతనాలు చేస్తూంటారని, నాకు తెలుసు. అందుకే, రాత్రివేళల్లో యిలా తిరుగుతూంటాను," అన్నాడు నీలయ్య.

"క్షమించండి! మిమ్మల్ని పోల్చుకోలేకపోయాను," అన్నాడు రాజు.

"నేనీదేశపు రాజును!" అన్నాడు నీలయ్య, మీసాలు దువ్వుకుంటూ.

"చిత్తం! ఇకనుంచి రాత్రిళ్ళు, యిలా తిరగను," అని, లోలోన మండిపడుతూ, రాజు అక్కణ్ణించి కదిలాడు.

నీలయ్య గుండె ఝల్లుమన్నది. నడకనుబట్టి, ఆ ముని రాజని, నీలయ్య పోల్చుకున్నాడు. వాడికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది.

వాడు రాజుతో, "క్షమించండి, స్వామీ! తమ తపశ్శక్తిని పరీక్షించగోరి, అలా మాట్లాడాను. నేను, రాజుగారి రజకుణ్ణని, తమరు దివ్యదృష్టితో గ్రహించారు. ఈ మూర్ఖుణ్ణి క్షమించండి!" అంటూ రాజు కాళ్ళమీదపడ్డాడు.

అంత కోపంలో వున్న రాజు, వాడి సమయస్ఫూర్తికి నవ్వుకుని వదిలేశాడు. ఆ తర్వాత నీలయ్య మారువేషాలు వేయడం మానేశాడు.

—బూర్లె నరసింహశాస్త్రి





# మాటదెబ్బ

సిరిపురం జమీందారు చిన్నమరాయుడు, ఒకనాటి సాయంకాలం, ఊరవతలికి షికారు వెళ్ళి, తిరిగి వస్తూండగా, దారిలో ఆయనకు బాగా విరగకాసిన మామిడితోట ఒకటి కంటబడింది.

జమీందారు, ఆ తోట కేసి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు. అది గమనించిన దివాను దివాకరుడు, ఆయనతో, "ప్రభూ, లోగడ తమరు, యీ తోట కేసి వచ్చినట్టు లేదు. తోట తమరిదే!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

జమీందారు, "అలాగా!" అంటూ తలవూపి, "కాపలా వుంటేనే దిక్కులేని యీ రోజుల్లో, తోటకు కాపలావాణ్ణి పెట్టకుండా, ఎందుకు వదిలేశారు? వెంటనే ఎవరో ఒకణ్ణి, కాపలాదారుగా నియమించండి," అని దివాను మీద చిరాకుపడసాగాడు.

దివాను వినయంగా, "తోటకు కాపలా లేకపోవడమేమిటి, ప్రభూ! రంగన్న అనే వాడు, ఈ మామిడి తోటకు కాపలాదారు. చాలా నమ్మకమైన మనిషి. ఎంతో కాలంగా వాణ్ణి, నేను ఎరుగుదును. ఏ పని మీదయినా, ఊళ్లోకి వెళ్ళాడేమో!" అన్నాడు.

అంతలో ఆయనకు, తోటలోని ఒక చెట్టు నీడలో కూర్చున్న ముసలావిడ కనిపించింది.

దివాను, ఆమెను జమీందారుకు చూపి, "ఆ ముసలమ్మ, రంగన్న తల్లి. ఆమె తోటలో వున్నంతవరకూ, చెట్ల నుంచి ఒక్క పిందెనైనా ఎవరూ రాల్చి పట్టుకుపోలేరు," అన్నాడు.

జమీందారు ఆశ్చర్యంగా, "ఆ ముసలిదానికి లేచి నిలబడేశక్తయినా వున్నట్టు లేదు! అది మామిడితోటను కాపలా

జొన్నలగడ్డ రత్న

కాస్తుందా ? ఏ దొంగవాడో వచ్చి. కాయలు కోస్తుంటే, లేవలేని ఆ ముసలిది ఏం చేయ గలదు ?'' అన్నాడు.

అందుకు దివాను, ''ప్రభూ, తుంటరు లనూ, దొంగలనూ అదిలించడానికి మనిషికి కేవలం కండబలమే, అన్ని సందర్భాలలోనూ పనికి రాకపోవచ్చు. ఒక్కొక్కసారి మాటదెబ్బతో, అవతలి వాణ్ణి చిత్తు చేయవచ్చు. ఈ ముసలిది అసాధ్యురాలనీ, అలాటి మాటదెబ్బతో, ఎదుటివాళ్ళను ఎన్నో సందర్భాలలో హడలగొట్టిందనీ, ఊళ్ళో అంతా అను కుంటూంటారు,'' అని చెప్పాడు.

ఇది విని జమీందారు మరింతగా ఆశ్చర్యపోతూ, ''అయితే, మనం తోటలోకి వెళ్ళి, మామిడికాయలు కోయడానికి ప్రయత్నిద్దాం. ఈ ముసలమ్మ, మనల్ని ఎలా ఆపగలదో తెలిసిపోతుంది,'' అన్నాడు.

జమీందారూ, దివానూ తోటలోకి వెళ్ళి, ఒక చెట్టు కింద నిలబడ్డారు. ఎవరో కొత్త వాళ్ళు తోటలోకి వచ్చారని గ్రహించి, ముసలమ్మ మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ, వాళ్ళున్న చోటుకు వచ్చింది.

దాపులనున్న ఒక చెట్టునుంచి, కాయలు కోద్దామనుకున్న జమీందారుకు, అక్కడ గడ్డిమేస్తున్న రెండు కోడెగిత్తలు కనిపించాయి. ఆయన ముందుకు వెళ్ళడానికి సంకోచించి, ముసలమ్మను, ''అవ్వా, ఆ



గిత్తలు పోట్లమారివి కాదు గదా ?'' అని అడిగాడు.

ముసలమ్మకు చూపు తక్కువ. ఆమె, జమీందారును చూసి ఎంతో కాలమయింది. ఆ కారణంవల్ల, ఆమె జమీందారును గుర్తుపట్టలేక, ఆయన కేసి కోపంగా చూస్తూ, "మీరేపని మీద వచ్చారో, నాకు తెలుసు! ఆ గిత్తలు పోట్లమారివో కాదో నాకు తెలీదు. వాటికి తమ గడ్డేదో తాము తినడంతప్ప,తమది కాని గడ్డి కరవడానికి, యితర్లతోటల్లోకి జొరబడవు,'' అన్నది.

ముసలమ్మ మాటల్లోని వ్యంగ్యం, జమీందారుకు చురుక్కుమని తగిలింది. ఆయన చప్పున వెనుదిరిగి, తోటబయటికి నడవసాగాడు. దివాను తృప్తిగా తలాడిస్తూ, ఆయనను అనుసరించాడు.

ముసలమ్మ, వాళ్ళకేసి చూస్తూ కొంతసేపు నిలబడి, తర్వాత వెళ్ళి, చెట్టు నీడలో కూర్చున్నది.

తోటలో నుంచి బయటకు వచ్చాక, దివాను, జమీందారుతో, ''చూశారా, అర్థం చేసుకోగల మనిషికి, మాటదెబ్బ తట్టుకోవడం ఎంత కష్టమో!'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

జమీందారు చిరునవ్వునవ్వుతూ, అవునన్నట్టు తల వూపాడు.

వాళ్ళు తోటలో నుంచి కాలిబాట దగ్గిరకు రాగానే, ఊళ్ళో నుంచి తిరిగి వస్తున్న రంగన్న వాళ్ళకు ఎదురుపడి, నమస్కరించాడు.

జమీందారు, దివానును, ''వీడేనా, మన తోట కాపలాదారు రంగన్న?'' అని అడిగాడు.

''అవును, ప్రభూ!'' అన్నాడు దివాను.

జమీందారు, రంగన్న కేసి మెచ్చుకోలుగా తలాడించి, ''ఒరే, రంగన్నా! నీ చేతిలోని బాణాకర్ర దెబ్బకు సాటి రాగలదురా, మీ అమ్మ మాటదెబ్బ! ఇదుగో, నా బహుమానంగా, యీ డబ్బు మీ అమ్మ కివ్వు.'' అంటూ, చొక్కా జేబులోంచి పదివరహాలు తీసి, రంగన్న చేతిలో పెట్టాడు.





## ఎత్తయిన ముళ్ళజెముడు

ముళ్ళజెముళ్ళలో అన్నిటికన్నా శాగ్వారో జాతివి ఎత్తుగా పెరుగుతాయి. 200 సంవత్సరాల కాలంలో 40-50 అడుగుల ఎత్తు పెరిగే వీటి బరువు. దాదాపు పది టన్నులదాకా వుంటుంది. అయితే. ఇందులో ఎనభై శాతం నీళ్లే వుంటాయి.

## అగ్నిపర్వతం లోపల అగ్నిపర్వతం!

అమెరికాలోని ఓరిగాన్ జ్వాలాముఖాశయం— నిజానికి చరిత్ర పూర్వ యుగం నాటి జ్వాలాముఖ అవశేషమే. పది కి. మీ. వెడల్పుగల ఈ జ్వాలాముఖాశయ మధ్య ప్రదేశంలో మరొక అగ్ని పర్వతం ఉన్నది।



## ప్రాణం తీసే కుక్కగొడుగు!



మామూలు పుట్టకొక్కులా కనిపించే డెత్ క్యాప్ (అమానిటా ఫలాయిడ్స్) అనే ఒక రకం కుక్కగొడుగు చాలా విష పూరితమైనది. ఇది. తిన్నవాళ్ళలో కలరావంటి వ్యాధిని పుట్టిస్తుంది।

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



P. V. Subramanyam



S. G. Seshagiri

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఆకలితీర్చే అమృతహస్తం! రెండవ ఫోటో: మూగజీవులకు మేమేనేస్తం!

పంపినవారు: ఎ. సి. వార్ద్, ప్లాట్ నం. 9, రంగానగర్ కాలనీ, హైదరాబాదు-37 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/— నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Help mother rabbit find her bunnies.



## The G-r-r-reat taste adventure




Cadbury's

**Wildlife BAR**

No ure the taste of
Dairy Milk with
Wildlife Bars.
bar with fun animal shapes
– and in a range of
welve exciting wildlife wrappers.

Cadbury's Wildlife Bars.
Track them down!